**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

---

## Bibliographic Record Target

Vivekananda, Swami, 1863-1902.
పరాభక్తి / స్వామి వివేకానందులవారి ఆంగ్లభక్తియోగమునకు ఆంధ్రీకరణము.- 1. ముద్రణము.- గుంటూరు : చంద్రికాముద్రాక్షరశాల, 1925.

(4), 91, (1) p., (1) leaf of plates. ; 22 cm.

Record no. 677

Vivekananda, Swami, 1863-1902.
Parābhakti / Svāmi Vivēkānandulavāri Āṃglabhaktiyōgamunaku Āṃdhrīkaraṇamu.- 1. mudraṇamu.- Guṃṭūru : Candrikāmudrākṣaraśāla, 1925.

(4), 91, (1) p., (1) leaf of plates. ; 22 cm.

Record no. 677

---

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB
Date filming began: 22 January, 2006

శ్రీరామకృష్ణాశ్రమ గ్రంథమాల.

పుష్పము ౨.

# పరాభక్తి.

శ్రీమత్

స్వామి వివేకానందులవారి

ఆంగ్లభక్తియోగమునకు

ఆంధ్రీకరణము.



అనువాదకుఁడు

కోటంరాజు సత్యనారాయణ,

గాంధిపేట, గుంటూరు.

1925

ప్రథమ ముద్రణము
గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాల యందు
500 ప్రతులు ముద్రింపఁబడినవి.

# ప్రస్తావన.

శ్రీరామకృష్ణులవారికథాశ్రవణ మించుక నాకు ప్రథమమున విద్యార్థిదశలో నామిత్రుడు వెలగలేటి బసవయ్యవలనగలిగినది. తదాది వారిగోష్ఠి హృదయకుహరమున గాఢముగ నిలచినది. గురువరునిస్మరణతో బాటు వారిముఖ్యశిష్యుడును, అమేయప్రతిభాశాలియు నగు వివేకానందులవారి వాగమృతమును గ్రోలనయ్యె. వారిగ్రంధముల జదివినకొలదిని యభిరుచి వృద్ధియై జీవితసమస్యానిర్ణయమునకు దివ్యజ్యోతియై నాకెంతయో మేలుచేకూర్చెను. నావంటిజిజ్ఞాసువులకు మార్గదర్శక మగుననియు స్వాములవారి భక్తిభావముల నాంధ్రసోదరుల కుపాయనమిడుటకు నీభక్తియోగమును ఆంధ్రీకరించితిని. ఇదివరకు వెలువడిన బ్రహ్మశ్రీ కూచి నరసింహంపంతులుగారి భక్తియోగోపన్యాసములలోని విషయముల నాంధ్రీకరించియుగూడ చర్వితచర్వణమని యాభాగములను వదలివైచి ఇప్పటివర కెవ్వరిచేతను ప్రకటింపబడని పరాభక్తి నిందుతో వెలువరచుచున్నాను. భక్తివిషయము భావనాతీతమగుటను, నాజ్ఞాన మతిస్వల్పమగుటను వివేకానందులవారి వాఙ్మాధుర్యము నాంధ్రులకు వినిపింపవలయుననెడి యుత్సాహమే నన్నీకార్యమునకు బురికొల్పినదిగాని దోషముల బాటింపనీయదయ్యె. స్వాములవారిభక్తియోగ మంతయు పరమభక్తుడగు నారదులవారి సూత్రములకు విపులమగువ్యాఖ్యానమువలె నుండుటచే నారదసూత్రములగూడ తాత్పర్యముతో నిందు జేర్చితిని. ఈగ్రంధపఠనముచే నొక్కభక్తుడు తృప్తివహించినను నేను కృతార్థుడనే. మొదటిభాగములోని నాల్గవఅధ్యాయమున మొదటవ్రాసిన గ్రంధములో చర్వితచర్వణమని కొంత దొలగించుటచే విషయ మించుక సందర్భరహితముగ నుండునుగాన కూచి నరసింహంపంతులవారి గ్రంధవిషయముతో దీనిని గూడజేర్చి చదువుకొనిన భక్తియోగ విషయము సమగ్రముగ నుండును.

రామకృష్ణాశ్రమము
గాంధిపేట
గుంటూరు
సెప్టెంబరు 1925.

విధేయుడు,
అనువాదకుడు.

## కృతి సమర్పణము.

అపర శ్రీరామకృష్ణుఁడై కృప, నస్పృశ్య
తానివారణ కసువుల ధారవోయు
త్యాగమూర్తి మహాత్మాభిధానుఁడైన
గాంధి కర్పింతు నిది నమస్కారయుతము॥



# విషయసూచిక.

### —* మొదటి భాగము. *—



### —• రెండవ భాగము. •—

శ్రీ రామ కృష్ణాయ నమః.



శ్లో॥ 'యది భవతి ముకుందే భక్తి రానందసాంద్రా
విలుఠతి చరణాబ్జే మోక్షసామ్రాజ్యలక్ష్మీః॥'

" స తన్మయో హ్యమృత ఈశ సంస్థో జ్ఞః సర్వగో భువనస్యాస్య గోప్తా । య ఈశే అస్య జగతో నిత్యమేవ నాన్యో హేతుర్విద్యత ఈశనాయ. "

'ఆత డీప్రపంచమునకాత్మ. మరణము లేనివాడు. పాలకత్వ మాతనిదే. సర్వజ్ఞుడు. సర్వవ్యాపి. ప్రపంచముయొక్క రక్షకుడు. నిరంతరపరిపాలకుడు. శాశ్వతముగ ప్రపంచమును పాలించుటకు మరొకడు సమర్థుడు లేడు'.

" యో బ్రహ్మాణం విదధాతి పూర్వం,
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై,
తంహ దేవం ఆత్మబుద్ధిప్రకాశం,
ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే॥ శ్వేతా.౬.౧౭.౧౮.

' సృష్ట్యాదిని బ్రహ్మ నెవ్వడు పుట్టించెనో, ఎవ డాతనికి వేదముల నిచ్చెనో, ఎవనియొక్కప్రకాశము బుద్ధిని ఆత్మవైపునకు మరల్చునో, అట్టిదివ్యస్వరూపుని మోక్షముకొఱకు శరణుపొందుచున్నాను'.

శ్రీరామ కృష్ణాయనమః.

# పరాభక్తి.

## మొదటిభాగము.

### ౧ అధ్యాయము.

### భక్తినిరూపణము.

భక్తియోగ మీశ్వరునిగూర్చి యథార్థమును, శుద్ధమునగున న్వేషణ. ఈయన్వేషణ ప్రేమలో నారంభమై, యవిచ్ఛిన్నముగ ప్రవహించి దానిలోనే అంత మొందును. ఈశ్వరునియెడ నిట్టివెఱ్ఱిప్రేమ క్షణమాత్రము చూపినను మనకు శాశ్వతవిముక్తియే. నారదుఁడు తనభక్తిసూత్రవివరణములో నిట్లుచెప్పియున్నాడు. "సా త్వస్మిన్ పరమప్రేమరూపా" ఈశ్వరునియెడ మిక్కుటమైనప్రేమ భక్తి. " యత్ప్రాప్య న కించిద్వాంఛతి న శోచతి న ద్వేష్టి న రమతే నోత్సాహీ భవతి ". అట్టి భక్తిగలనరుడు సమస్తమును ప్రేమించును, దేనినిగాని ద్వేషించడు. ఆతడు శాశ్వతసంతృప్తుడు. " సా న కామయమానా నిరోధరూపత్వాత్ " ఈప్రేమ ఏవిధమైన భౌతికవాంఛకును కానేరదు. " నిరోధస్తు లోకవేదవ్యాపారన్యాసః." ఏలనన భౌతికవాంఛ లున్నంతవరకు అట్టిప్రేమ కలుగదు. " సాతు కర్మజ్ఞానయోగేభ్యో ప్యధికతరా ఫలరూపత్వాత్" భక్తి కర్మకంటెను, యోగముకంటెను హెచ్చు. ఏలనన నివి మనస్సున నేదైన నుద్దేశముతో జేయబడును. భక్తియన్ననో దాని ఫలితమును, సాధనమును, పరిణామమునుగూడ నదియే.

భక్తియే మనఋషులయొక్క నిరంతరయోచనావిషయముగ నుండెను. భక్తినిగురించి ప్రత్యేకముగ వ్రాసినవారి, ననగా నారదులు శాండిల్యులమాట యటుండ మహాత్ములగు వ్యాససూత్రభాష్యకారులు, యథార్థమగు జ్ఞానవాదులు ప్రేమనుగురించికూడ చాలగ జెప్పియున్నారు. భాష్యకారుడు, అన్నిసూత్రముల గాకున్నను, గొన్నిటినైన నొకవిధమగు నిస్సారజ్ఞానము నుపదేశించువానిగ నిరూపింప జాలగ నాతురతజూపినను, సూత్రములు ముఖ్యముగ నుపాసనప్రకరణమున నావిధముగ తంత్రముచేసి యిముడ్చబడుటకు సులభసాధ్యములుగావు.

నిజముగ (ప్రేమ) భక్తిజ్ఞానములకు జను లనుకొనునంతటిభేదము లేనేలేదు. ముందుముందు చదివినకొలది జివర కవిరెండు నొకటే స్థానమున గలసికొనుట జూచెదము. అట్లే రాజయోగముగూడ, (దురదృష్టవశమున నది టక్కరిమాంత్రికులు, తంత్రగాండ్రచేతులలోవలె) అమాయకులకన్నుల దుమ్ముగొట్టుటకుగాక ముముక్షుత్వమునకు సాధనగ గైకొనబడినపుడు అట్టిగమ్యస్థానమునే పొందించును. భక్తియొక్క గొప్పలాభమేమన అది ఈశ్వరుని బొందుటకు మిగుల సులభమును సామాన్యమును సరళము నైనమార్గము. దానియొక్కనష్టమేమన దాని నీచావస్థలో దరచుగనది క్రూరమగుమూర్ఖాభిమానముగపరిణమించును. హిందూమహమ్మదీయ క్రైస్తవ మతములలోని మూర్ఖపుగుంపుయీ భక్తియొక్క నీచావస్థలోని ఉపాసకులనుండియే సదా ప్రోగుచేయబడినదే. ఎట్టిదిలేక యథార్థప్రేమ అభివృద్ధిగాదో, అట్టిప్రేమవస్తువునందలి ఏకైకనిష్ఠ, చాలతరచుగ తదితరవస్తువులందలి ద్వేషమునకు గూడ కారణమగుచున్నది. ప్రతిదేశములోని, మతములోని, బలహీనులును, అభివృద్ధి రహితచిత్తులును వారియాదర్శమును బ్రేమించుట



కొకేమార్గము గలదు. ఏదన బ్రతితదితరాదర్శమును ద్వేషించుటే. తన ఈశ్వరాదర్శమున కంతటినిరంతర సంబంధము కలిగినటువంటియు, స్వీయమతాదర్శమున కంతటిభక్తి గలిగినటువంటియు మనుజుడు తన దానికన్న వేరొకయాదర్శమును జూచినపుడుగాని వినినపుడుగాని యంతమూర్ఖముగ బొబ్బ లేలయిడవలెనో యనువిషయమునకు సమాధాన మిదియే. ఈవిధమగు ప్రేమ తనయజమానునియాస్తి నితరు లంటకుండగాపాడుచుండెడి కుక్కబుద్ధివంటిది. మనుజుని హేతువాదమునకన్న కుక్కబుద్ధియే మేలుగ గనుపట్టును. ఏలనన, కుక్క తనయజమానుడు ఎన్నిమారు వేషములలో తనముందునకు వచ్చినను శత్రువుగ నెంచదు. మరియు, నామూర్ఖాభిమాని న్యాయాన్యాయ విచక్షణను గోలుపోవును. అతనికి మనుజాభిమానము ఇతరు లేదైన జెప్పినచో నది మంచిదైనను చెడుదైనను చెవినిబెట్టకుండునంతటి స్వాభిలాషగ నుండును. అదెవరు చెప్పుదు రనువిషయమునందు మాత్రమే యాతని కెక్కువశ్రద్ధ. తనభావముల కనుకూలురగు జనులకు దయాశీలుడును, మంచివాడును, మర్యాదస్థుడును, ప్రేమైకపాత్రుడును అగుమనుజుడే, తనమతసంఘమునకు చెందనివారివిషయమున నైనచో నుడువరాని దుష్కృత్యములను జేయుట కావంతయును జంకడు.

ఈయపాయము భక్తియొక్క గౌణి లేక సిద్ధావస్థలో మాత్రమే. భక్తి పక్వ లేక పరావస్థలోనికి వచ్చినపుడు యీమూర్ఖ మతాభిమానమును బ్రదర్శించెడియవకాశములే గలుగవు. ఇట్టిది యున్నతభక్తిభావపూరితమై ఆత్మప్రేమైకమూర్తియగు భగవానుని సాన్నిధ్యమునకు చేరి ద్వేషలేశములను వెదజిమ్మి పారవైచెడిపరికర మగును.

ఈమానవజన్మమున స్వభావనిర్మాణమున నైకమత్యముతో మెలగెడి యోగ్యత మనకందరికి కలుగదు; గాని యీమూడుగుణములును భక్తిజ్ఞానయోగములు—పరస్పరద్వేషరహితముగ సమన్వయించబడినమూర్తి యత్యున్నతమైనదని మన మెఱుంగుదుము. పక్షి కెగుదుటకు మూడువిషయము లత్యావశ్యకములు. రెండు ఱెక్కలు, మార్గమున నడిపించెడి చుక్కాణియగు తోక. జ్ఞాన మొక ఱెక్క. భక్తి రెండవఱెక్క. యోగము తూనిక సరిగనుంచెడితోక. ఈత్రివిధములగు నర్చనామార్గములను శాంతముతో సమన్వయించుకో లేక కేవలభక్తిమార్గము నే యవలంబింపగోరెడివారికి నీకర్మకాండకు సంబంధించిన ఆచారవ్యవహారములు, అభివృద్ధిగోరెడియాత్మ కత్యావశ్యకములైనను, మన కీశ్వరునియందు అత్యంతమగుప్రేమ కలిగెడిస్థితికి మనలను గొనిపోవుట తప్ప మరొకదాని కెందునకు గొరగావని సదా నమ్ముట మిక్కిలి యావశ్యకము.

భక్తిజ్ఞానవాదు లిద్దరును భక్తియొక్కశక్తిని ఒప్పుకొనుచున్నను వారిద్దరి కించుక యభిప్రాయభేదము లేకపోలేదు. జ్ఞానులు భక్తిని విముక్తి కొకపరికరముగ గ్రహింతురు. భక్తులో దానినే పరికరమును, ప్రాప్యము ననిగూడ నందురు. నాకిది విస్తారము భేదములేని వ్యత్యాసము. నిజముగ భక్తి యొకపరికరముగ గ్రహింపబడినపుడు నిజముగ నది యర్చనయొక్క నీచావస్థయే. కాని, కొంతకాలము గడచినపిమ్మట నీయున్నతరూపము అనుభవనీయమగు నీచరూపమునుండి యభేద్యమగును. ప్రతివాడును విశుద్ధమైనప్రేమవలన యథార్థజ్ఞానము వెతకుకొనకయే తనంతదానే కలుగుననియు, విశుద్ధజ్ఞానమునుండి యథార్థప్రేమ యభేద్యమనియు మరచిపోయి విచిత్రములగు స్వీయార్చనాపద్ధతుల నొక్కిపల్కుచుండును.



దీనిని మనసులో నుంచుకొని యీవిషయమై మహాత్ములగు వేదాంత భాష్యకారు లేమిచెప్పిరో గమనించెదము. "ఆవృత్తి రసకృదుపదేశాత్" అను సూత్రవివరణమున శంకరభగవానులు ఇట్లు నుడివియున్నారు.

"జను లిట్లు పలుకుదురు—ఆతడు రాజభక్తుడు, ఆతడు గురుభక్తుడు." వారు తనగురువు ననుసరించెడివానిని గూర్చియే యట్లు పలుకుదురు. అట్లుపలుకుటగూడ నట్టియనుసరణమే ప్రాధాన్యముగ మదిలో నుంచుకొనియే. అటులే వారు "ప్రేమాస్పదురాలగుభార్య ప్రేమాస్పదుడగుభర్తనుగూర్చి ధ్యానముచేయును" అని చెప్పుదురు. ఇచటగూడ నొకవిధమగు నాతురతతోగూడినట్టియు, తెంపులేనట్టియు ఎఱుక చెప్పబడినది. శంకరులవారి మతానుసార మిదియే భక్తి.

ధ్యేయమును నిరంతరము స్మరణలోనుంచుకొనుట ధ్యానము. అది యొకపాత్రనుండి మరొకపాత్రలోనికి పడుచుండెడి యవిచ్ఛిన్నమగు తైలధారవంటిది. ఈవిధమగు స్మరణ యీశ్వరునియెడ గలిగినపుడు బంధనములన్నియు దెగిపోవును. ఆవిధముననే శాస్త్రములలో నీనిరంతరధ్యానము ముక్తిసాధనముగ జెప్పబడినది. ఈధ్యానము, మరల, చూచుటవంటిదే. ఏలనన దీని యర్థమును,

శ్లో॥ భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే॥

"దూరస్థుడును, సమీపస్థుడు నగువాడు చూడబడినపుడు హృదయబంధనములన్నియు విచ్ఛిన్నములగును. సంశయములన్నియు నివారించును. కర్మఫలము లదృశ్యమగును." అనుదానియర్థము నొకటే.

సమీపస్థుని జూడగలము. దూరస్థుని స్మృతియందుమాత్రమే యుంచుకొనగలము. ఎటులైనను, శాస్త్రము సమీపస్థునివలెనే

దూరస్థునిగూడ జూడవలెనని చెప్పుచున్నది. దాన నీపై జెప్పబడిన స్మరణ చూచుటవంటిదే యని మనకు దెలియుచున్నది. ఈస్మరణ ఔన్నత్యమున జూచుటవంటిదేయగును............ ప్రధానశాస్త్రప్రమాణ్యానుసారముగ నర్చనయన నిరంతరస్మరణయే. మాటిమాటికి జేసెడి యర్చనవంటిదే యగు జ్ఞానము నిరంతరస్మరణగా వర్ణించబడినది.........అటులనే సూటిగ దర్శించెడిస్థితిని బొందినట్టి (జ్ఞప్తి) స్మృతి శ్రుతిలో విముక్తి సాధనమని చెప్పబడినది.

"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో,
న మేధయా న బహునా శ్రుతేన,
యమే వైష వృణుతే తేన లభ్యః,
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్॥" కాఠక.

"ఈయాత్మ వివిధశాస్త్రములచేతను,బుద్ధిచేతను, వేదపఠనముచేతను, పొందబడదు. ఎవరైతే యీయాత్మను గోరుచున్నారో వారే దానిని పొందుచున్నారు. ఆతనికే యీయాత్మ సాక్షాత్కరించును."
ఇచట నూరకవినుట, తలచుట ధ్యానించుటమాత్రమే యాత్మదర్శనమునకు మార్గములుగావని చెప్పినపిమ్మటనే, "ఎవరైతే యీయాత్మను గోరుచున్నారో వారే దీనిని పొందుదురు" అనిచెప్పబడినది. మిక్కిలి ప్రియమైనదే కోరబడును. ఎవరిచేతనైతే యీయాత్మ మిక్కిలిగ ప్రేమించబడినదో ఆతడే యీయాత్మకు ప్రియతముడగును. ఈప్రియతము డాత్మను బొందునటుల ఈశ్వరుడే సహకారియగును. ఏలనన భగవాను లిట్లనుచున్నారు.

శ్లో॥ అనన్యాః చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

"ఎవరైతే నాతో నిరంతరసంబంధము వహింతురో, నన్ను ప్రేమతో



బూజింతురో, వారు నన్ను జేరుటకు మార్గమును నేనే జూపుచున్నాను". కావుననే సూటియగు దర్శనముతో సాటియగుస్మరణ ఎవరెవరికి మిక్కిలిప్రియమో, ఏలనన నట్టిస్మరణ దర్శనముగలవిషయమునకు ప్రియమైనదిగావున ఆపరాత్మవలన నాతడు కోరబడినాడు. ఆతడే పరాత్మను బొందును, అని చెప్పబడినది. ఈనిరంతరస్మరణ భక్తియను పదముచే వర్ణించబడినది. అట్లు భగవానులగు రామానుజులవారు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యనుసూత్రభాష్యమున జెప్పియున్నారు. "ఈశ్వరప్రణిధానాద్వా" —ఈశ్వరునిపూజవలన—యనుపతంజలి సూత్రభాష్యమున భోజు డిట్లుచెప్పుచున్నాడు. "ప్రణిధానమన నింద్రియసుఖములు మొదలగుప్రతిఫలములను గోరక సమస్తకర్మలనుగురువులకు గురువగునీశ్వరుని కర్పించెడి యేభక్తికలదో యది." ఆసూత్రమునకే దనభాష్యమున వ్యాసులవారు ప్రణిధానమును "యోగిపై దేనివలన బరాత్పరునికరుణగలుగునో, ఆతనికోరికలదీర్చి సంతృప్తిపరచునో యట్టి భక్తి" యని వచించినారు. శాండిల్యమతానుసారము "సా (భక్తిః) పరానురక్తి రీశ్వరే," నిరతిశయమగుప్రేమ యీశ్వరునియెడ జూపుట భక్తి. వీనియన్నిటికన్న నుత్తమమైనవర్ణనమే మనభక్తుల కగ్రేసరుడైన ప్రహ్లాదునివాక్యము.

"యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ
త్వం అనుస్మరత సా మే హృదయా న్మాపసర్పతు॥"

ప్రేమ! ఎవరియందు? జగదీశ్వరునియందు. ఇతరులయెడ ప్రేమ ఎంత యెక్కువగనున్నను అది భక్తి కానేరదు. ఏలనన, రామానుజులవారు తనశ్రీభాష్యములో బూర్వాచార్యుల దృష్టాంతపరచుచు నిట్లుచెప్పియున్నారు.

శ్లో॥ ఆబ్రహ్మస్తంబపర్యంతాః జగదంతర్వ్యవస్థితాః
ప్రాణినః కర్మజనితసంసారవశవర్తినః,

యతః తతో న తే ధ్యానే ధ్యానినా ముపకారకాః,
అవిద్యాంతర్గతాః సర్వే తేహి సంసారగోచరాః॥

బ్రహ్మమొదలు గడ్డిపోచవరకును నీప్రపంచమున జీవించుప్రతివస్తువును కర్మయొక్క ప్రతిఫలమగు జన్మమును మరణములకు సదా లోనిసలగు ను; గావున, నవి ధ్యేయవిషయములు గాజాలవు. ఏలనన, నవన్నియు నవిద్యలో మునిగి మార్పుకు లోబడియున్నవి. శాండిల్యు డుపయోగించిన "అనురక్తి" యనుపదవ్యాఖ్యానమున వ్యాఖ్యకారుడగు స్వప్నేశ్వరు డిట్లు చెప్పుచున్నాడు. "అను=పిమ్మట, రక్తి=సంబంధము." అనగా ఈశ్వరునిస్వభావమును మహిమను ఎఱిగెడిజ్ఞాన మలవడిన పిమ్మట గలిగెడిసంబంధము. లేకున్నచో దేసియందలి, అనగా, ఆలుబిడ్డలయందలి యంధప్రేమగూడ భక్తియగును. కావున, మనము విశదముగ భక్తి సాధారణార్చనతో నారంభమై ఈశ్వరునిపై యత్యంతము, నున్నతమునగు ప్రేమతో నంత్యమగు మతానుభవమునకగు మానసికప్రయత్నముల పరంపరయని చూచుచున్నాము.



# పరాభక్తి.



## ౨ అధ్యాయము.

## ఈశ్వరతత్వము.



ఈశ్వరు డెవడు? "జన్మాద్యస్య యతః" — ఎవనివలన సృష్టి, స్థితి, లయములు కలుగుచున్నవో ఆత డీశ్వరుడు. ఇంతియెగాక,

శ్లో॥ జన్మాద్యస్య యతోన్వయా దితరత శ్చార్థే ష్వభిజ్ఞః స్వరాట్,
తేనే బ్రహ్మహృదా య ఆదికవయే ముహ్యన్తి యత్సూరయః,
తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గో మృషా,
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి॥

సీ॥ విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వానివలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమున గార్యములం దభిజ్ఞుడై తాన రాజగుచు చిత్తమునజేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావులనీళ్ళ గాచాదుల నన్యోన్యబుద్ధి దా నడరునట్లు
ఆ॥ త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము భంగి దోచు స్వప్రభానిరస్త
కుహకు డెవ్వ డతని గోరిచింతించెద ననఘు సత్యు బరుని ననుదినంబు॥ భాగవత.

మరియు శాశ్వతుడు, శుచి, సదాస్వతంత్రుడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వదయాళుడు, గురూణాం గురుః, ఇంతియె గాక

"స ఈశ్వరః అనిర్వచనీయప్రేమస్వరూపః"

ఆయీశ్వరుడు వచింపలేనట్టి ప్రేమస్వరూపుడు.

ఇవి నిజముగ సాకారుడగు భగవంతుని వర్ణనములు. అట్లైన నిద్దరు భగవంతులు గలరా? వేదాంతియొక్క "నేతి, నేతి,"

"సచ్చిదానంద స్వరూపుఁడే," భక్తులయొక్క "ప్రేమస్వరూపుఁడు."
లేదు, ఆసచ్చి దానందస్వరూపుఁడే ప్రేమస్వరూపుఁడుగూడను.
నిరాకారుఁడు సాకారుఁడుగూడను. భక్తులు పూజించెడి సాకారేశ్వ
రుఁడు బ్రహ్మమునుండి భిన్నుఁడుగాని వేరుగాని గాఁడు. అంతయును
బ్రహ్మమే. "సర్వంఖల్విదం బ్రహ్మ" "ఏకమేవాద్వితీయం
బ్రహ్మ". "ఐక్యుఁడు లేక పూర్ణుఁడు నగుబ్రహ్మము ప్రేమించుటకును
బూజించుటకును ప్రత్యేకింపబడుట దుర్లభము. గావున భక్తుఁడు బ్రహ్మ
ముయొక్క సాన్వయాకారమును (Relative aspect)అనగా, సర్వేశ్వ
రత్వమును నిర్ణయించుకొనును. ఉపమానముతో జెప్పినచో—బ్రహ్మ
ము అనేకవిధములగువస్తువులు చేయబడినటువంటిమట్టివంటిది. మట్టి
రూపమున నన్నియు ఒకటే గాని రూపములచేమాత్రము భిన్నములు.
అట్టివస్తువులన్నియు చేయబడక ముందు మృత్తులో సాధ్యముగ నడఁగి
యుండెను. వాస్తవమున నవన్నియు నభిన్నములనిచెప్ప నగత్యములేదు.
గాని నిరూపింపబడినపుడు అట్టిరూప మున్నంతకాలము అవిభిన్నములే,
వేరుగనేయుండును. మట్టియెలుక మట్టియేను గెన్నటికిని గాఁజాలదు.
ఏలనన, నిరాకారమగుమృత్తుగ నవన్నియు భేదరహితముగ నొకటే
యైనను బ్రత్యేకస్వరూపముల బొందిన వెంటనే భిన్నములగును. ఈశ్వ
రుఁడే పరిపూర్ణసత్యముయొక్క యత్యున్నతమగు ప్రత్యేకస్వరూపము.
మానవచిత్తము భావించుటకు వీలగునత్యున్నతమగుపరిపూర్ణము. సృష్టి
శాశ్వతము. ఈశ్వరుఁడుగూడ శాశ్వతుఁడే. బ్రహ్మసూత్రములలో నాల్గవ
ప్రకరణమున నాల్గవపాదమున ముక్తజీవునకు మోక్షము పొందినపిమ్మట
వచ్చెడిదాదాపుఅపరిమితశక్తిజ్ఞానములనుగూర్చి చెప్పుచు,(జగద్వ్యాపార
వర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ) (ఆప్నోతి స్వారాజ్య మితిశ్రుతిః)
వ్యాసులవారు మరొకసూత్రముచే (ప్రత్యక్షోపదేశా దితిచేన్నాధి
కారికమండలస్థోక్తేః) "సృష్టిస్థితిలయములశక్తి మరొకరి కెవ్వరికిని



రాదు. ఏలనన అది ఈశ్వరునకే గలదు," అనిచెప్పుచున్నారు. ఈసూ
త్రవివరణమున ద్వైతవ్యాఖ్యాతలకు ఈశ్వరునకంటె తక్కువవారలగు
జీవులకు ఎట్టిశక్తినిపొంది ఈశ్వరునితో సంబంధము లేక స్వతంత్ర
ముగనుండుట సదా యసాధ్యమో చూపుట మిగుల తేలిక. మధ్వా
చార్యులవారీసూత్రమును దనమాయూలుసంగ్రహమార్గమున వరా
హపురాణమునుండి యొకశ్లోకము నుదాహరించి వ్యాఖ్యానించి
యున్నారు. ఈసూత్రమును వివరించుచు వ్యాఖ్యాతయగురామాను
జులవారిట్లుచెప్పిరి.—ముక్తాత్మలకుగలశక్తులలో బరాత్పరునియొక్క
యద్వితీయశక్తిఅనగా సృష్టి, స్థితి, లయములశక్తియును, సర్వేశ్వ
రత్వమును గలదో లేక యదిలేకుండనే యీవిముక్తునిప్రభావము పరా
త్పరుని సాక్షాత్తుగ జూచుటలోనే గలదో యనువిషయమున క్రింది
వాదము చూపబడినది. ముక్తులు సృష్టిపాలనము పొందుట సహేతు
కమే. ఏలనన "ఆతఁడీశ్వరునితో నమితతుల్యత్వమును పొందును. ఆతని
కోరికలన్నియు నెరవేరును." అని శాస్త్రములు చెప్పుచున్నవి. ఇపు
డమితతుల్యత్వము, కోరికలునెరవేరుట, యీశ్వరుని యద్వితీయశక్తి,
అనగా విశ్వపాలనాశక్తి లేకయే పొందబడవు. కావున, వాంఛాతృప్తి
నిస్నీ, యీశ్వరతుల్యత్వమును బొందుటకొరకె ముక్తులు విశ్వపరిపాల
నను బొందుదురని మనమందర మొప్పుకొని తీరవలెను. దీనికి మన
జవాబేమన, ముక్తులు విశ్వపరిపాలనదక్క తదితరశక్తుల నన్నిటిని
బొందుదురు. విశ్వపరిపాలనమున, ఎవరినుండి ఈశ్వరునియథార్థస్వ
రూపమును మరుగుపరచుతెర తొలగింపబడినదో, ఎవరు పరబ్రహ్మ
ముయొక్క నిరాటంకదర్శన భాగ్యమహిమను సదాపొందుచున్నారో
యట్టివిముక్తులుదప్ప తక్కినసర్వసచేతన, అచేతన పదార్థములయొక్క
రూపము, జీవము, కోరికలకు సరియగుమార్గమును జూపుట. ఇదియా,

"యతోవా ఇమాని భూతాని జాయంతే
యేన జాతాని జీవంతి, యత్ప్రయ న్త్యభిసంవిశంతి
త ద్విజిజ్ఞాసస్వ, త ద్బ్రహ్మేతి.

ఎవరినుండి యీవస్తుజాలమంతయు బుట్టినదో, ఎవరివలన నిపుట్టిన దంతయు జీవించుచున్నదో, చివర కెవరి నవన్నియు జేరునో దానిని గూర్చి యడుగుము. అది బ్రహ్మము."

అనుశాస్త్రవచనమువలన దృఢపరచబడినది. ఈవిశ్వపరిపాలనాగుణము ముక్తులకుగూడ సామాన్యముగ నుండుచో, నపు డీశ్లోక మీశ్వరుని విశ్వపరిపాలకత్వవర్ణనమునకు జెందదు. అసామాన్యమునకుమాత్రమే ముఖ్యముగ వర్ణన మావశ్యకము; గావున, "స దేవ సోమ్యే! ఇద మగ్ర ఆసీత్ ఏకమే వాద్వితీయం, తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి, తత్తేజో అసృజత, తత్తేజో ఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి, తదాపో అసృజత.

నాముద్దుకుర్రా! ఆరంభమున ఒక్కటిమాత్రమే యుండెను. రెండపది లేదు. దానిని చూచి యనుభవించి, అనేకమునకు జన్మము నిచ్చుచున్నాను. అదియే యగ్నిని సృష్టించెను."

"బ్రహ్మవా ఇద మగ్రఆసీత్. ఏక మేవ. తదేకం సన్నవ్యభ
వత్, తచ్ఛ్రేయోరూప మత్యసృజత క్షత్రం,
యాన్యేతాని దేవతాక్షత్రాణి, ఇన్ద్రో, వరుణశ,
సోమో, రుద్రశ, పర్జన్యో, యమో, మృత్యు, రీశాన ఇతి."॥

ఆరంభమున బ్రహ్మమాత్రమే, యథార్థముగ నుండెను. ఆయొకటియే పరిణమించెను (Evolve). అది యొకశుభరూపమును సృష్టించెను. అదియే క్షత్రము. ఈదేవతలందరు క్షత్రములు, వరుణుడు, సోముడు, రుద్రుడు, పర్జన్యుడు, యముడు, మృత్యువు, ఈశానుడు.



"ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్. నాన్యత్ కించన మిషత్స,
ఈక్షత లోకాన్ను సృజాయితి. స ఇమాం ల్లోకా నసృజత.

ఆత్మమాత్రమే నిజముగ మొదటనుండెను. మరొక టేదియు గన్పించ లేదు. ఆతడు చూచుచు ప్రపంచమును సృష్టించెను. ఆతడు పిమ్మట విశ్వమును సృజించెను."

"నారాయణుడుమాత్రమే యుండెను. బ్రహ్మగాని ఈశానుడుగాని, ద్యావాపృథివిగాని, నక్షత్రములుగాని, జలాగ్నిసోమసూర్యులుగాని లేవు. ఆత డొంటరిగ సంతసింపలేదు. ఆతనికి ధ్యానానంతర మొకకూతురు; దశేంద్రియములు మొదలగునవి పుట్టినవి."

ఇట్టివిని యింకను,

"యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో, యం పృథివీ
న వేద, యస్య పృథివీ శరీరం యః పృథివీ మన్తరోయ మయ
త్యేషత ఆత్మాఽన్తర్యా మ్యమృతః॥
భూమిలో నివసించుచు భూమితో భిన్నుడెవడో ఆత్మలో
వసించుచు........"

మొదలగువాక్యములలో శ్రుతులీయీశ్వరుని విశ్వపరిపాలనకు కర్తగ చెప్పుచున్నవి. ఈవిశ్వపరిపాలకవర్ణనములలో నట్టిముక్తాత్మకు విశ్వపరిపాలనారోపణగలస్థితి యేమియు జెప్పబడియుండలేదు. తరువాత సూత్రము వాఖ్యచేయుచు రామానుజులవా రిట్లుచెప్పుచున్నారు. "దీనికి వ్యతిరేకముగ వేదములలో సూటియగుశ్లోకములు గలవుగాన నట్లుగాదని చెప్పినచో నీసూత్రములు నీచదేవతలయొక్క తక్కువస్థితులలో నివి ముక్తులమహిమకు జెందును." ఇట్లుగూడ నీకఠినసమస్యను సులువుగ విడదీయవచ్చును. రామానుజులవారిమతము పరిపూర్ణముయొక్క ఐక్యము నొప్పుకొనినను, ఆపరిపూర్ణస్థితిలో ఆయనమతానుసారము

శాశ్వతమగు భేదములు గలవు; గావున, అనుభవనీయవిషయము లన్నిటికి నీమతముగూడ ద్వైతముగ నున్నదిగాన రామానుజులవారికి సాకారాత్మకును సాకారేశ్వరునకును గలభేదమును విశదముగ నుంచుటకు సులువయ్యెను.

ఈవిషయమున నద్వైతమతాగ్రేసరులైనశంకరులవా రేమిచెప్పెదరో తెలుసుకొనుటకు యత్నింతము. అద్వైత మెట్లు ద్వైతమతముయొక్క యాశాపాశముల చెక్కుచెదరకుండ నుంచుటయేగాక; యీదైవిక మానవకోటియొక్క ఉత్కృష్టాదృష్టముతో ఐకమత్యముగ మెలంగుచు, నీసమస్య నెట్లు పరిష్కారముచేయుచున్నదో చూచెదముగాక. ఎవ్వరైతే ముక్తినిబొందినపిమ్మటగూడ తనవ్యక్తిమానసికమును నిలువబెట్టుకొనుటకును, వేరుగ నుండుటకును గోరుచున్నారో వారికి తమకోరికలఫలితమును బొందుటకును, సగుణబ్రహ్మముయొక్క యాశీర్వాదము ననుభవించుటకును కావలసినంతయవకాశ మున్నది. ఇట్టివారే భాగవతపురాణములో నిట్లు చెప్పబడియున్నారు.

శ్లో॥ ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రన్థా అప్యురుక్రమే
కుర్వం త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః॥

క॥ ధీరులు నిరపేక్షులు నాత్మారాములు నైనమునులు హరిభజనము ని
ష్కారణమ చేయుచుందురు నారాయణు డట్టివాడ నవ్యచరిత్రా!

ఇట్టివారినే సాంఖ్యులు పరిపూర్ణత్వమునుబొందినపిమ్మట, రాబోవు యుగములలో సృష్టి కధీశ్వరులుగా వచ్చుటకుగా నీయుగమున బ్రకృతిలో గలసిపోవువారినిగ జెప్పియున్నారు. వీరిలో నెవ్వరు నెన్నటికిని ఈశ్వరునితో దుల్యులుగారు. ఎచ్చటసృష్టిగాని, సృష్టించబడినదిగాని, సృష్టించువాడుగాని లేదో, ఎచట తెలుసుకొనువాడుగాని, తెలుసుకొనుటగాని, తెలుసుకొనబడెడిదిగాని లేదో, ఎచట నీవు, నేను,



వా డనునది లేదో, ఎచట కర్తగాని కర్మగాని, సంబంధముగాని లేదో అట్టిస్థితిని బొందినవారికి "అచట ఎవరిచేత ఎవరు చూడబడిరి ?"— అట్టివారు, అన్నిటిని

"యత్ర వాచో నివర్తంతే అప్రాప్య మనసా సః,"—ను గూడమించి శ్రుతులు పలుకుచుండెడి "నేతి, నేతి" యనుదానిని జేరిరి. ఇట్టిస్థితిని జెందనట్టి, చెందలేనట్టివారికి, ఏకము నభేద్యము నగుబ్రహ్మముయొక్క త్రిమూర్త్యాత్మకము—ప్రకృతి, ఆత్మ, యీరెంటిమధ్యనుండి రక్షించెడివాడు— ఈశ్వరునియొక్కదర్శనము తప్పకుండ మిగిలియుండును; గావున బ్రహ్లాదుడు తన్నుతాను మరచిపోయినపుడు ఆతనికి సృష్టిగాని దానికికారణముగాని గోచరముగాలేదు. సమస్తము నాతనికనంతముగ, నామరూపములచే నభేద్యముగ నుండెను గాని యాతడు తననుతాను ప్రహ్లాదుడని ఎఱింగినవెంటనే ఆతనిముందు సృష్టి దానితో సృష్టి కధీశ్వరుడు— అనంతకల్యాణగుణగణసమూహ ముండెను. అటులే గోపికలవిషయముగూడ. వారు తమస్వీయంవ్యక్తిత్వమును మరచియున్నంతకాలమును వారందరు కృష్ణులే. అట్టియెడ తదాత్మకత్వంబున గృష్ణలీలల ననుకరించుచు

సీ. పూతనవైయొక్కపొలంతి చరింపంగ । శౌరివై యొకకాంత చన్నుగుడుచు,
బాలుండై యొకభామ పాలకు నేడ్చుచో । బండి నేనని లేమ బాఱదన్ను,
సుడిగాలినని యొక్కసుందరి గొనిపోవ । హరినని వర్తించు నబ్జముఖియు,
బకుడ నేనని యొక్కపడంతి సంరంభింపఁ । బద్మాక్షుడనుకొమ్మ పరిభవించు,
ఆ. నెలమి రామకృష్ణు లింతు లిద్దఱుగాఁగ । గోపవత్సగణము గొందఱగుదు
రసుర వైరి ననుచు నబల యొక్కతె చీరుఁ । బసుల మనెడిసతుల భరతముఖ్య॥
ఆ. లోకములు గుక్షిలోపలనున్నది మాధవుండ నేను మాత వీవు
చూడు మనుచు నొక్కసుందరి యొకతెకు, ముఖముఁ దెఱచి చూపు ముఖ్యచరిత.
క. వెన్నలు దొంగిలి తినియెడి వెన్నుఁడనని యొకతె నుడువ వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును గ్రిన్నన కనుమములదండఁగట్టు నిలేశా.

క. కాళియఫణి యిది వీరలు కాళియఫణిసతులు మ్రొక్కఁగడఁగిరి నే గో
పాలకుమారుఁడ ననుచును లీలాగతి నాడు నొక్కలేమ నరేంద్రా.

క. తరుణులు గోపకు లందరు హరిహయుఁడిదె వానగురిసె హరి నేనని భా
సురచేలాంచల మెక్కితె గిరి నెత్తెదననుచు నెత్తెఁ గొంగేల నృపా,

క. మీరలు గోపకు లే నసురారిని దావాగ్ని వచ్చె నటుసూడకుఁడీ
వారించెద నని యొక్కతె సేరి బయల్ కబళనంబుసేయు నరేంద్రా.

మరల నాతని నెప్పుడు పూజనీయుడుగ దలంచి

సీ. ఈచరణంబులే యిందునిభానన సనకాదిమునియోగసరణి నొప్పు
నీపాదతలములే యెలనాఁగ శ్రుతివధూసీమంతవీథులఁ జెన్నుమిగులుం,
నీపదాబ్జంబులే యిభకులోత్తమయాన పాలేటిరాచూలిపట్టుఁగొమ్మ
లీసుందరాంఘ్రులే యిందీవరేక్షణ ముక్తికాంతామనోమోహనంబు

ఆ. లీయడుగులరజమె యింతి బ్రహ్మేశాది దివిజవరులు మౌళిదిశలఁదాల్తు
రనుచుఁగొంద ఱబల లజ్జాత్మఁ డేఁగిన క్రమముఁగనియు నతనిఁగాన్పరెరి.

ఉ. నీవు యశోదబిడ్డఁడవె నీరజనేత్ర సమస్తజంతుచే
తోవిదితాత్మ వీశుఁడవు తొల్లి విరించి దలంచి లోకర
క్షావిధ మాచరింపు మని సన్నుతిసేయఁగ సత్కులంబునన్
భూవలయంబుఁగావ నిటుపుట్టితిగాదె మనోహరాకృతిన్.

ఆ. చరణసేవకులకు సంసారభయమును । బాపి శ్రీకరంబు పట్టుగలిగి
కామదాయియైన కరసరోజంబు మా । మస్తకముల నునిచి మనుపు మీశ॥"

యనికీర్తింప గడంగిరో అపుడు గోపికలు. వెంటనే,

శ్లో॥ తాసా మావిరభూత్ శౌరిః, స్మయమానముఖాంబుజః
పీతాంబరధరః స్రగ్వీ, సాక్షా న్మన్మథమన్మథః॥

మ. అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం బాడుచుం
దను రావేయని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్యమో
హనుఁడై మన్మథమన్మథుండయి మనోజ్ఞాకారియై హారియై
ఘనపీతాంబరధారియై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్.



మరల మన శంకరాచార్యు లిట్లు చెప్పుచున్నారు.

" సగుణబ్రహ్మము నుపాసించి తమమనస్సును కాపాడుకొనుచు సర్వేశ్వరునితో సంయోగము బొందినవారియొక్క మహిమకు పరిమితి కలదా. లేదా? ఈశంకవొడమిన దానివాదన కిట్లున్నది, — వారి మహిమకు పరిమితి యుండగూడదు. ఏలనన శాస్త్రములు " ఆప్నోతి స్వారాజ్యం "— వారు స్వారాజ్యము బొందుదురు. "ఆతని దేవత లందరు పూజింతురు. " " స సర్వాగ్ శ్చ లోకాన్ సర్వాగ్ శ్చ కామాన్ ఆప్నోతి. " " ప్రపంచము లన్నిటిలో వారికోరికలు తృప్తి పొందింపబడును. "

దీనికి సమాధానము వ్యాసులవా రిట్లువ్రాయుచున్నారు.

" జగ ద్వ్యాపారవర్జం "—సృష్టిపరిపాలనాశక్తి లేకుండ. సృష్టి, స్థితి, లయములశక్తితప్ప, తక్కిన అణిమ, లఘిమ, మొదలగుశక్తులు ముక్తులకు గలుగును. సృష్టిపాలనో అది శాశ్వతపరిపూర్ణుడగు ఈశ్వరునకే గలదు. ఏల? ఏలనన, సృష్టినిర్మాణమునకు జెందుశాస్త్రములన్నిటి కాతడు కర్త; సృష్టినిర్మాణసంబంధమున నెచటను నట్టిముక్తాత్ముల యుదాహరణమే లేదు. పరమేశ్వరుడుమాత్రమే, యథార్థముగ, సృష్టిపాలనలో నియుక్తుడైయున్నాడు. సృష్టిమొదలగువాక్యము లన్నియు నాతనినే చూపును. " శాశ్వతపూర్ణుడు " అనువిశేషణముగూడ గలదు. శాస్త్రము లితరులయణిమ, లఘిమ, మొదలగుశక్తులు ఈశ్వరుని బూజించుట, ఆయన నన్వేషించుటనుండియే యని నుడువును. కావున, సృష్టిపాలనలో వారికి స్థానము లేదు. మరల, వారికి వారి చిత్తములుండుటచే వారిసంకల్పములు భేదించవచ్చును. ఒకరు సృష్టిని తలపెట్టినచో మరొకరు లయమునకు దలపోయవచ్చును. ఈచిక్కునుండి బయటపడుటకుమార్గ మీచిత్తములనన్నిటి నొకదానికి లోబరచియుంచుటయే. కావున సారాంశమేమన ముక్తులయొక్క సంకల్పములు పరమేశ్వరునిసంకల్పములపై నాధారపడియున్నవి."

భక్తి, అపుడు, బ్రహ్మముయొక్క సాకారాంశముపైననే మరల్పబడ గలదు.

శ్లో॥ అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే

అవ్యక్తమునందు చిత్తమునుంచువారికి మార్గము మిగుల గష్టము. భక్తి మనయొక్క స్వభావప్రవాహము ననుసరించి శాంతముగ బ్రవహించవలెను. సాకారుడుకానట్టి బ్రహ్మమునుగూర్చి మన కిట్టిదనుభావమేమియు నుండదనిమాట వాస్తవమే; గాని, మనమెఱిగిన యన్నిటియొక్క విషయ మట్లుగాదా? ప్రపంచమంతయు నెన్న డెఱుగనట్టి యాత్మతత్వజ్ఞుడగు కపిలభగవానుడు చాలకాలముక్రిందటనే మనము చూచునట్టియు తలంచునట్టియు, యాంతరంగికబహిరంగికవిషయము లన్నిటి నిర్మాణమునకగుభూతములలో మానవచైతన్య మొకభూతముగ నున్నదని ఋజువుచేసియున్నాడు. మనశరీరము మొద లీశ్వరునివరకు మనము చూచుప్రతివిషయమును మానవచైతన్యము + మరొకటి (అదేదియైననుసరియే)గ చూచెదము. ఈతప్పనిసరియగు మేళనము సాధారణముగ యథార్థమనుకొనునదియే. నిజముగ, నిది మానవమనస్సు నెఱుగ శక్తిగల యథార్థమంతయు నదియేయైయున్నది. శాశ్వతముగ నుండ గలదు. గావున, ఈశ్వరుడు ఆకారముగలవాడు గావున లేడనిచెప్పుట పట్టి వదరుబోతుతనమే. పాశ్చాత్యులదగు "కల్పితము, యథార్థము," అనుదానిపైగల జగడమువలె దోచును. ఆయథార్థమనుమాటపై నట్టి ఘోరమగు పోట్లాట యాధారపడియున్నది. ఈశ్వరభావము యథార్థమనుమాటచే సర్వదా తెలిపిడిచేయబడెడిసమస్తమును గప్పివేయును. ఈశ్వరుడు సృష్టిలోని తదితరములవలెనే యథార్థము. కడకు, యథార్థమనుమాట కర్థ మిప్పుడు చూపినదానికన్న మఱేమియు కాదు. ఈశ్వరుని విషయమై మన వేదాంతులభావన మట్టిది.



# పరాభక్తి.



3 అధ్యాయము.

## భక్తియోగలక్ష్య మాత్మానుభవము.



భక్తుని కీసారహీనములైన వివరణములన్నియు నాతనిమానసికశక్తిని బలపరచుటకుమాత్రమే. అంతకుమించి వానివలన బ్రయోజన మేమియు లేదు. వలనన, నీహేతువాదసంక్షోభపరిధులను దాటి యాత్మానుభవయోగ్యమగుపరిస్థితులకు నతిత్వరలో గొనిపోయెడిమార్గమున నాతడు సంచరించుచున్నాడు. అతడు త్వరలో, నీశ్వరకరుణావలన, డాంబికమును, శక్తిహీనము నగుహేతువాదము బొత్తుగ వదలివేయబడినట్టన్ని, పట్టిబుద్ధికౌశల్యముచే చీకటినబడి తడవులాడుకొనుటకు బదులుగ సూటిగ నవలోకనముచేయుటకు వీలగువెలుగుగలస్థితిని చేరును. ఆత డిక హేతువాదములు సల్పి దాదాపుగ చూచును. అత డికవాదించక స్పృశించును. ఈయీశ్వరుని జూచుట, స్పర్శించుట, అనుభవించుట, తక్కిన యన్నిటికంటె నధికముగాదా? లేదు. అది మోక్షముకన్నను, అధికమని చెప్పెడిభక్తులు లేకపోలేదు. అదియే యధికమైన సౌకర్యముగూడ గాదా? ప్రపంచములో మానవులకు పశు (భౌతిక) సౌఖ్యముల నిచ్చెడివిమాత్రమే ఉపయోగమును, సౌకర్యమును గలిగియుండునని నమ్మెడివారు–చాలమందియే–కలరు. మతము, ఈశ్వరుడు, శాశ్వతత్వము, ఆత్మ, యివి యేవియు వారికి ద్రవ్యమునుగాని, భౌతికసౌఖ్యములనుగాని యివ్వవుగాన నిరుపయోగ

లు. అట్టివారి కింద్రియతృప్తిచేయనట్టియు, నింపుగనుండని పదా
ము లన్నియు నిష్ప్రయోజనములు. ప్రతిమనస్సులోను సౌకర్యము
నివాని యభిలాషలపరిమితినిబట్టి యుండును. కావున, తినుట,
ాగుట, సంతానముగనుట, పిమ్మటచచ్చుట — వీనికన్న నుచ్చైః
నిగోరనట్టిమనుజుల కింద్రియసంతృప్తియే కలిగెడిలాభము. వారికి
ష్టతస్థితిని బొందుట యావశ్యకమని కొంచెపుతలంపు కలుగుట
నను వారు చాలజన్మములనెత్తుచు వేచియుండవలెను. ఎవరికి శాశ్వత
ు నాధ్యాత్మికసౌఖ్యములు, యీయశాశ్వతములునగు లౌకిక
ఖ్యములకన్న మిన్నలో, ఎవరికి నింద్రియసంతృప్తి నోరులేనిపసి
లుర యజ్ఞానక్రీడావిలాసమో, అట్టివారి కీశ్వరుడును, ఈశ్వర
మయును, మానవజీవితమున కత్యున్నతమగుసౌకర్య మగును.
ుమయప్రపూర్ణప్రపంచములోగూడ కొంద రట్టివా రింకను నదృష్ట
మున జీవించియున్నారు.

ర్మయోగ మిదివరకు చెప్పినట్లు గౌణి లేక ప్రథమావస్థ పరావస్థ
రిరెండుగ విభజింపబడియున్నది. మనము పోయినకొలదిని, ప్రథ
ావస్థలో మనయభివృద్ధి కనేకములైన సాకారముల (Concrete)
ావశ్యకత ఎట్లుతప్పనిసరియో చూచెదము. నిజముగ నన్నిమతము
ోని పౌరాణికసాంకేతిక భాగములు ముముక్షువునకు స్వభావజన్య
లై, యచిరముగ దానిని పరివేష్టించి యీశ్వరసాన్నిధ్యమును చేర్చ
ాకారులగును. ఏమతములో బురాణములు, ఆచారకాండ ఎక్కు
మన్నవో యట్టిమతసాంప్రదాయికులలోనే మిగులగొప్పవారగు
ఃవేత్తలు పుట్టిరనువిషయము మనకందరికి దేటతెల్లమే. శ్రావ్యము
ు, సొంపుగను, ఉత్కృష్టముగ నున్నదియు, ఈశ్వరమార్గాన్వేషణ
ు బాల్యదశలోనుండి కొట్టుకలాడుచిత్తమునకు నూతనొసగుసమస్త
ు నిర్మూలనము చేయనెంచు రసహీనములగు మాఢ్యమతపద్ధ



తులు— ఆధ్యాత్మికగృహముయొక్క మూలస్తంభములనే తెగగొట్ట
యత్నించుచు, యథార్థముయొక్క తమయజ్ఞానమాఢ్యభూతములగు
భావనలలోబడి జీవన మిచ్చునమస్తమును, మానవహృదయమున నభి
వృద్ధిపొందుచున్న మతాంకురమునకు రూప మేర్పడుటకు పరికరముల
నొసంగుచున్నసమస్తమును ద్రోలివేయ యత్నించెడిపద్ధతులు— అట్టి
మతపద్ధతు లచిరకాలముననే తమపాలబడినదంతయు వట్టిడొల్ల ఒకవిధ
మగు సాంఘికవినాశము (ఊడ్పు) లేక నామకార్థముగనున్న సంస్కా
రాభిలాషయే యించుక చవిగాగలిగినపసలేనివట్టిబూటకపు కుతర్క
మన్నియు కనుగొనగలవు.ఇట్టిమతము నేయవలంబించునట్టిజనసమూహము
తెలిసియో తెలియకయో యనాత్మవాదు లగుచున్నారు. ఇహమునను
బరమునసుగూడ వారిజీవితపరమార్థము విషయానుభవమే.ఇదియే వారి
మానవజీవితసర్వస్వము. వారియిష్టాపూర్తము. మానవునిభౌతికసౌఖ్య
మున కగుబజారులూడ్చుట, శుభ్రముచేయుటయే వారిమతానుసార
ము మానవజీవితపరమార్థ మందురు. ఇట్టియజ్ఞానమాఢ్యమిళితవిచిత్ర
మతావలంబు లందఱు ఎంతత్వరగబయటబడి వారికి తగినసోదరులైన
నాస్తికులు, అనాత్మవాదులలో గలసిపోయిన ప్రపంచమున కంతమం
చిది. ఋజువర్తనముయొక్కయు, ఆధ్యాత్మికానుభవముయొక్కపర
మాణువే కొండలుపెట్టుగ నున్నపదరుబోతుతనము, దుర్భావముకన్న
మిన్నగ తూగును. ఈసారహీనమైనయజ్ఞానమాఢ్యములనుండి పుట్టిన
యొకగొప్పమతవేత్తను జూపుడు. అట్లుచూపలేనియెడల నోరులు
మూసుకొని నిర్మలమగుసత్యజ్యోతికి మీహృదయద్వారముల దెరచి
వైచి తా మేమిపలుకుచున్నారో దాని నెఱింగిన—భారతీయఋషుల
పాదపద్మములసన్నిధిని బాలురవలె కూర్చుండుడు. పిమ్మట వా రేమి
చెప్పెదరో జాగ్రత్తగ వినుడు.

# పరాభక్తి.



౪ అధ్యాయము.

## పరికరములు.



భక్తున కావశ్యకములగు పరికరములలో నివి కొన్నియైయున్నవి.

(1) వివేకము, (ఆహారవిచక్షణ యని రామానుజులవారు)

(2) ఇంద్రియ నిగ్రహము,

(3) అభ్యాసము,

(4) యజ్ఞకర్మ,

(5) పవిత్రత,

(6) బలము,

(7) హర్షము నణగద్రొక్కుట.

(1) ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః, సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః, స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః, తస్మై మృదితకషాయాయ తమసస్పారం దర్శయతి ... ... ఛాందోగ్య.

భక్తుల కాహారసమస్య సర్వదా ప్రాణసమానమైనవానిలో నొకటై యున్నది. కొన్నిభక్తసంఘములు బట్టినవిపరీతమార్గములమాట యటుండ, నీయాహారసమస్యనుగురించినగొప్పయథార్థ మొకటి యున్నది. సాంఖ్యమతానుసారము సామ్యావస్థయందు (Homogenous Equilibrium) ప్రకృతియై (అవ్యక్తమై) చలనావస్థయందు (Heterogenous disturbed condition) సృష్టి (వ్యక్తమై) యైన— యీసత్వ, రజ,



స్తమోగుణములు ప్రకృతియొక్క ద్రవ్యగుణములుమాత్రమే. అగుటచే ప్రతిమానవశరీరము నిర్మింపబడుటకైనపదార్థము లవియే. మరియు, నాధ్యాత్మికాభివృద్ధికి సత్వపదార్థాధిక్య మత్యంతావశ్యకము. మనశరీరములోనికి ఆహారముగుండ బోయెడిపదార్థములు మనమానసికావస్థ నిర్ణయమున కగుచున్నవి. కావున మనము తినునాహారవిషయములో నెక్కువజాగ్రత్త తీసుకొనవలెను. ఐనప్పటికి తక్కినవానిలోవలె నీవిషయములోను తప్పకుండ నీభక్తు లవలంబించెడి మూర్ఖపుమతావేశమునకు వారిగురువులు కారకు లనగూడదు. ఈవిషయమునే వేరొకవ్యాఖ్యాత యెట్లునిర్వచించెనో మీకు చెప్పెదను. "ఆహారము పవిత్రముగ నున్నపుడు చిత్తముగూడ పవిత్రమగును. చిత్తముగూడ పవిత్రముగ నున్నపుడే భగవద్భక్తి నిశ్చలముగ కుదురును.'' శంకరులవారు పూర్తిగ భిన్నమార్గమును గైకొనిరి. ఆహారమను నీపదము సంస్కృతమున "ఆహార," హరించుట యనుపదమునుండి యుద్భవించినది. హరింపబడినది. వారివివరణ మేమి? ఆహారము పవిత్రముగనున్నపుడు చిత్తము నిర్మలముగ నగుననువిషయము, యథార్థమున, ఇంద్రియములకు వశులముగాకుండుటకు మన మీక్రిందివానిని త్యజించవలెనని యర్థము. మొదట:— మమకారము (Attachment) ఈశ్వరునియందుదప్ప తక్కిన వేనియందును ఎక్కువగ మమకార ముంచగూడదు. ప్రతిదానిని చూడుము. ప్రతిదానిని జేయుము; గాని మమకారముమాత్ర ముంచకుము. మమకారముమాత్ర మతీతమైనపుడు నరుడు తనను తానే మరచును. ఇక నేమాత్ర మతడు తనకు తాను యజమానుడు గాడు. ఆత డొకబానిసయే. ఒకస్త్రీ పురుషునం దతీతముగ మమకార ముంచినచో ఆమె వానికి బానిసయగును. బానిసయగుటవలన ప్రయోజనము శూన్యము. ప్రపంచములో మానవునకు బానిసయగుటకంటె గొప్పవిషయములు చాల గలవు. ప్రతివానిని ప్రేమించి మేలొనర్చుము.

కాని బానిసవుమాత్రము గాకుము. వ్యక్తులవిషయమున, మమకారము మొదట నవినీతుల నొనర్చి, పిమ్మట, మిగుల స్వార్థపరులుగ జేయును. ఈనీచతచేతనే మనము ప్రేమించెడివారిమేలుకొఱకు ఇతరులకు కీడొనర్పగోరుదుము. ప్రపంచమున నొనర్పబడు ఘోరకృత్యములు చాలభాగము యథార్థముగ కొందరిజనులపైగల మమకారబుద్ధిచేతనే చేయబడుచున్నవి. సత్కార్యములయందుదప్ప తదితరములగల మమకారమును త్యజించవలెను; గాని యందరిని మాత్రము ప్రేమించవలెను.

శంకరరామానుజులవారి వివరణములు పైకి వ్యతిరేకముగ గానుపించుచున్నవి, గాని, రెండును అత్యావశ్యకములును, యథార్థములును. సూక్ష్మశరీరము, లేక మనస్సును తంత్రములచే వశపరచుకొనుట మాంసపూరితమైనస్థూలశరీరమును వశపరచుకొనుటకంటె నెక్కువైన సంగతియే. కాని సూక్ష్మమును నిగ్రహించుటకుగాను మొదట స్థూలమును నిగ్రహించుట మిక్కిలిముఖ్యమైనది. కావున, ప్రారంభకుడు అనుభవజ్ఞులగుగురుపరంపరనుండి వచ్చినయాహారవిషయమునందైనచట్టములకు ఎక్కువశ్రద్ధ జూపవలెను. మనతెగలనేకములలోవలె మతముయొక్క గౌరవభాజనమైన సత్వము నెన్నటికిని యాధ్యాత్మికాతపమును జూచెడియాశ లేకుండునట్లు పూర్తిగ వంటయింటిలో పూడ్చిపెట్టిన నీయర్థము లేనిమితిమీరినగొప్పనమ్మకము (Fanaticism) ఒక విచిత్రమైన శుద్ధమగుభౌతికవాదమై (Materialism) యున్నది. అది భక్తిజ్ఞానకర్మలలో నేదియును గాదు. అది యొకప్రత్యేకవిధముగు పిచ్చి. అట్టిపిచ్చిపై తమయాత్మసర్వస్వము నుంచినవారు బ్రహ్మలోకముమాటయేమోగాని తప్పక పిచ్చివాండ్రయాసుపత్రి కేగుట యథార్థము. కావున ఆహారవిచక్షణసమస్య మనమానసికాభివృద్ధి కత్యావశ్యకమను



మాట సకారణముగనేయున్నది. దానిని మఱొకతేలికమార్గమున బొందజాలము.

ఒక్కొకనికి శంకరునివ్యాఖ్యానము శ్రేష్ఠ మని చెప్పుట సహజమేగాని, నామతము రామానుజులవారివ్యాఖ్యనుగూడ చిన్నచూపుతో చూడ గూడదని. యథార్థమైనభౌతికాహారమువిషయమై జాగ్రత్తగ నుండినప్పుడేగదా తక్కినవన్నియు గలుగుట. మనస్సే యజమానియనుట నిజమే, గాని యింద్రియములకు వశముగానివారు చాలయరుదు. మనమందరము ప్రకృతికి దాసులమే. అటులున్నంతకాలము మనము భౌతికసహాయమును గైకొనవలె, పిమ్మట బలవంతులమైనపుడు మన కిష్టమైనవానిని తిని త్రాగవచ్చును. అన్నపానములజాగ్రత్తలో మనము రామానుజులవారి ననుసరించవలె; అదేసమయమున మనచిత్తాహారమునుగూర్చిగూడ జాగ్రత్తపడవలె. భౌతికాహారమునుగూర్చి జాగ్రత్తపడుట సులభమేగాని, మానసికకర్మగూడ దానితోపాటు జరుగవలె. అప్పుడు క్రమేణ మనయాధ్యాత్మికశక్తి యడుగడుగునకు బలీయమై, యాధిభౌతికశక్తి బలహీనమగును. అప్పు డాహారమునకు కీడును గలుగజేయజాలదు. గొప్పయపాయ మేదన, ప్రతిమనుజునకును చివరమెట్టు నెక్కవలెనని కోరికయే, గాని ఎగురుటగాదు మార్గము. దానికి పతనమే ఫలితము. మన మిపు డురిత్రాళ్ళలో దగుల్కొని యుంటిమి. వానిని మెల్లగ త్రెంచుకొనవలెను. ఇదియే వివేకము, తారతమ్యవిచక్షణ.

తరువాతది విమోక్షము, స్వాతంత్ర్యము.

ఈశ్వరుని ప్రేమించవలెననుకొనెడివాడు విపరీతపుకోర్కెల త్యజించవలె. ఈశ్వరునిదప్ప మఱొకదానిని గోరకుము. ఈప్రపంచక మింతకన్న నున్నతలోకముల బొందుటకు సహాయకారియగునంతవరకు మంచిదే.

విషయవాంఛలుగూడ నున్నతవిషయముల బొంద సహకారులుగ
నున్నంతవరకు మంచిదే. మన మెల్లపుడు నీప్రపంచక మొకయున్నత
స్థానమునకు మనల గొనిపోవుట కొకమార్గమేగాని యిదియే యంత్య
స్థానము గాదనుమాటను మరతుము. దీనితోనే యంత్యమగునెడల
మన మీభౌతికశరీరముతో మరణమనునది లేకుండనుండవలె. మన
మెన్నడును చావగూడదు. కాని, ప్రతినిమిషమును మనపరిసరముల
జనులు చచ్చుట చూచుచునేయుండియు, మరల తెలివిమాలి మన
మమరులమని తలంతుము. ఈగట్టిపిచ్చినమ్మకముచే నీజీవితమే గమ్యస్థాన
మని తలంచుచున్నాము. మనలో నూటికి తొంబదితొమ్మిదిమందిస్థితి
యిదియే. ఈయభిప్రాయమును వెంటనే మరువవలెను. ఈప్రపంచ
కము మనల పరిపూర్ణులుగ జేసికొనుట కొకమార్గముగ నుండునంత
వరకు మంచిదే. ఎపుడటుల కాకుండునో యపుడే చెడ్డది. గావున,
భార్య, బిడ్డలు, భర్త, ధనము, విద్య, మనకు ముందునకు జనుటకు
సహాయముగనున్నంతవరకు మంచివే. అవి యటులనుండుట మాని
నంతనే కీడుదప్ప మరేమియుగావు. భార్య మన కీశ్వరుని బొందుటకు
తోడ్పడెనా మంచిదే, అటులే భర్త, బిడ్డలవిషయముగూడ. ద్రవ్యము
గనుక నితరుల కుపకారముచేయుటకు సాయపడునా, యది కొంతయుప
యోగమే. అట్లుగానిచో నది ఘనీభవించినకీడే. దాని నెంతత్వరలో
వదల్చుకొనిన నంత మేలు.

తరువాతది యభ్యాసము:—

మనస్సు సదా ఈశ్వరునియందే లగ్నమైయుండవలెను. ఏయితరవిషయ
ములకు దాని నాపుటకు వీలులేదు, అర్హత లేదు. ఇది కఠినకర్మమైన
ప్పటికి నది ఈశ్వరునే చింతించవలెను.



"అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే."

ఐనను ఎడతెగనియభ్యాసముచే చేయగలము. మనయిప్పటిస్థితి మనపూ
ర్వాభ్యాసఫలితము. మరల నభ్యాసమే మనభవిష్యత్స్థితినిగూడనిర్మిం
చును. గావునమారుత్రోవన యభ్యసించుము. ఒకవిధమైనప్రదక్షిణము
మనల నీమార్గమునకు దెచ్చెను. మారుత్రోవకు వీలయినంతత్వరలో దీని
నుండి బయటబడుము. విషయవాంఛాధ్యానము మనల నిట్టిస్థితికి దెచ్చె
ను. ఒకక్షణ మేడ్చెదము. మరొకక్షణము సంతసించెదము. ప్రతిగా
లికి తలయొగ్గుచు, ప్రతిదానికి బానిసలమైతిమి. ఇది మిగులలజ్జాకరము.
కాని మనల మనము దేవతల మనుకొనెదము. మరొకత్రోవను బొమ్ము.
ఈశ్వరుని ధ్యానించుము. మనస్సును శారీరకమానసికసౌఖ్యములవిష
యమైగాక యీశ్వరునిగూర్చియే చింతింపనిమ్ము. అది యితరముల
గూర్చి చింతింప యత్నించినపుడు దానిని దండించుము. అది మరల
తిరిగి యీశ్వరుని ధ్యానించును. ఒకపాత్రలోనుండి వేరొకపాత్రలో
పోయునూనె ఎడతెగనిధారగా ప్రవహించునట్లు, దూరమునుండివచ్చెడి
గంటలచప్పుడు ఎడతెగనియొకేశబ్దముగ వినబడునట్లు, మనస్సుగూడ నీశ్వ
రునియెడల నేకధారగా ప్రవహించవలెను. మనస్సునే యీకార్యము
నకు నియోగించుటయేగాక యింద్రియములగూడ నియోగించ
వలెను. పిచ్చికబుర్ల నన్నిటిని వినుటకుబదులుగ మన మీశ్వరనామ
మునే వినవలెను. పిచ్చిమాటల పల్కుటకుబలు లీశ్వరసంకీర్తనమే చేయ
వలెను. పిచ్చిపుస్తకముల జదువుటకుబదు లీశ్వరకథలుగలవానినే చదు
వవలెను. మనస్సున నీశ్వరధ్యానము నుంచుట కభ్యాసముచేయుటకు
ఎక్కువసహకారియగునది గానము. భక్తులలో నుత్తముడగునారదునకు
భగవంతు డిట్లుపలికెను.

శ్లో॥ నాహం వసామి వైకుంఠే, న యోగిహృదయేషుచ
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద॥

'నేను స్వర్గములో వసించను, యోగులహృదయములో వసించను, గాని నాభక్తులు నన్నెచట సంకీర్తనముచేతురో యచటనే యుందును.' గానమున మానవహృదయమును వశములోనుంచుకొనెడి యతీతమైన శక్తి గలదు. అది క్షణములో మానవచిత్తమును నిశ్చలముగనుంచును. ఎన్నడును తమచిత్తమును నిశ్చలముగ నుంచుకొననేరని యలసులు, అజ్ఞానులు, నీచులు, పశుతుల్యులగువారు, ఆకర్షణకరమగు గానమును వినినంతనే వారిహృదయము లానందమున సుప్పొంగి నిశ్చలముగ నుండును. కుక్కల, సింహముల, పిల్లుల, పాములహృదయములుగూడ గానమును వినినంతనే యుప్పొంగును.

శ్లో॥ శిశు ర్వేత్తి, పశు ర్వేత్తి, వేత్తి గానరసం ఫణీ

పిమ్మటిది క్రియ, కర్మ, పరోపకారము :—

ఈశ్వరధ్యాన మసూయాపూరితహృదయములకు రాదు. మనము బయటకువచ్చి పరుల కెంతటిమేలు నొనర్తుమో యంతగ మనహృదయములు పవిత్రమై, యీశ్వరధ్యానపూరితము లగును. మనశాస్త్రములప్రకారము మనకు "పంచయజ్ఞములు" అనునైదుకర్తవ్యములున్నవి. మొదటిది బ్రహ్మయజ్ఞము, లేక అధ్యయనము.

మనుజుడు ప్రతిదినమును పవిత్రవంతమును కల్యాణప్రదము నగుదాని నధ్యయనము చేయవలెను.

రెండవది దేవయజ్ఞము.

ఈశ్వరుడు, దేవదూతలు, ఋషులు, వీరిపూజ చేయవలెను.

పిమ్మట దయ, అహింస:—

మనోవాక్కాయకర్మల నేజంతువునకు హానిచేయకుండుట.



ఈయహింస మన మన్నిజంతువులవిషయమున చూపవలసినది. మన విధియైయున్నది. కొందరనినట్లు మానవులకు కీడుచేయక నీచజంతువులయెడ ఘోరమగునిర్దాక్షిణ్యమును జూపుట యనునర్థమున గైకొనగూడదు. లేక మరికొందరు చెప్పినట్లు పిల్లులను, కుక్కలను పెంచి చీమలకు పంచదారబెట్టి, తోడిమానవుని ఘోరహింసబెట్టుట యందు స్వేచ్ఛగలిగియుండుట యనునర్థమగునా? ఈప్రపంచమున ప్రతిసద్భావమునకును విపరీతార్థములను గల్పించుటకు వీలున్నది. మనము న్యాయమైనయేచట్టములోనుండు ప్రతిమాటను అనుసరించి యర్థమును లాగి యమలులోబెట్టినను చివరకది కీడుగనే పరిణమించును. కొన్నిమతతెగలలోని కంపుగొట్టుచుండు సన్యాసులు, తమ తమశరీరములపైనుండెడి సూక్ష్మజీవులు చచ్చుననుభయముతో స్నానములను వీడి, తమతోడిమానవుల కెట్టియనారోగ్యమును బాధలను గలిగించుచున్నారోగూడ నెన్నడును తలంపరు. ఐనను, వారు వేదమతానుసారులు గారు !!

అసూయలేకుండుటే యహింసకు నిదర్శనము. ఆనిమిషమందలి యుత్సాహముననో, లేక, ఏదో మూఢవిశ్వాసముననో, లేక పురోహిత నిర్బంధముననో ఎవడైన నొకసత్కార్యమునుగాని లేక సద్ధర్మమునుగాని చేసియుండవచ్చును. కాని, ఎవరియందును ద్వేషములేనివాడే యథార్థముగ మానవకోటిని ప్రేమించువాడు. ప్రపంచములో గొప్పవారని యనుకొనబడువా రందరును పేరుప్రతిష్ఠలకో, యించుకధనమునకో, వారిలో వారు ద్వేషించుకొనుచుండుట మనము చూచుచున్నాము. ఈయసూయ హృదయములో నేమూల నించుకంతయున్నను నది యహింసకు చాలదూరము. ఆవుగాని గొఱ్ఱెగాని మాంసమును తినవు; గావున నవి గొప్పయోగినులా! ? అహింసకులా!! ? ఇది యది

తినకుండ నేమూర్ఖుడైన నుండగలడు. అంతమాత్రమున నాతడు పచ్చిక మేయుజంతువులకన్న శ్రేష్ఠుడు గాడు. నిర్దాక్షిణ్యముతో వితంతువులను, పితృహీనులను మోసముచేయువారును, ధనముకొరకు నీచకార్యముల జేయువారును బొత్తుగ పచ్చికమేసి జీవించెడిపశువులకంటె నతినీచులే. పరుల కపకారముచేయుదమను భావ మెవనిహృదయమందు జొరదో, తనప్రబలశత్రుని ఐశ్వర్యాభివృద్ధియం దెవనికి సంతసముదయించునో, వాడు ప్రతిదినము పందిమాంసముచే జీవించుచున్నను వాడే భక్తుడు, వాడే యోగి, వాడే గురూణాంగురుః.

కావున బాహ్యాభ్యాసము లాంతరంగికపవిత్రతాభివృద్ధికై సహకారులగుటయే వానివిలువయని మనము సదా మరువగూడదు. బాహ్యాభ్యాసముల నతిసూక్ష్మముగ నవలంబింప నశక్తుడయ్యేనేని యాంతరంగిక పవిత్రతనే కలిగియుండుట మంచిది. అయ్యో! మానవుడైనను, జాతియైనను, మతముయొక్క యథార్థ, ఆంతరంగిక, ఆధ్యాత్మికావశ్యకతల మరచి, కన్నుల మూసికొని బాహ్యరూపము లన్నిటిని గట్టిగబట్టుకొని వానిని వదలకుండుట వారివారిదౌర్భాగ్యతగదా! రూపములకవి యాంతరంగికజీవితములకు చిహ్నములుగ నున్నంతవరకే విలువగలదు. అవి సజీవములుగానిచో వానిని వెంటనే పాపమనకుండ నణచివేయవలెను.

దానము :—

అనావసదము (బలము) భక్తియోగమునకు మరొకమార్గము. శ్రుతి: "నాయ మాత్మా బలహీనేన విద్యతే" యనుచున్నది. బలహీనమన శారీరకమానసిక దౌర్బల్యము. "దృఢవంతులును, పట్టుదలగలవారును" మాత్రమే యోగ్యులు. మిగుల నల్పులును, ముదుసలులునగువారేమిచేయగలరు? ఏవైనయోగాభ్యాసములచేత శారీరకమానసికశక్తులించుక సంచలనము జూప నారంభింపగానే వానికి తాళలేక విచ్ఛిన్నహృదయులగుదురు. "యువకులును, ఆరోగ్యవంతులును, బలవంతులునుమాత్రమే" జయింతురు. కావున శరీరసౌష్ఠవ మత్యావశ్యకము. ఇంద్రియనిగ్రహముచే గలిగెడితాకిడికి సహించి నిలువగలుగునది దృఢకాయముమాత్రమే. భక్తుడు కాగోరువాడు దృఢకాయుడు నారోగ్యవంతుడుగ నుండవలెను. అతిబలహీనులు యోగాభ్యాసముచేయ యత్నించినచో నేదైన కుదురనిరోగము కలుగుటో లేక మనశ్శక్తి క్షీణించుటో జరుగును. ఆధ్యాత్మికాభివృద్ధికి శరీరమును శుష్కింపజేయు టొకనియమము గాదు.



మానసికదుర్బలు లాత్మను సందర్శింపజాలరు. భక్తుడు గా నభిలషించువాడు మిగుల నుత్సాహముతో నుండవలెను. పాశ్చాత్యప్రపంచమున మతావలంబనతకు నిదర్శనము, నవ్వుదాని నెఱుంగకుండుటే, సర్వదా దవుడలు లోనికిగుంజుకొని ముఖమును మాడ్చుకొనియుండుటే. శుష్కించినశరీరములును, ముడుతలుపడిన మొగమును వైద్యుపాలే గాని యోగులపాలు గాదు. హర్షపూరితచిత్తమే శ్రీమ[illegible]న పలు కష్టములనుండి బయటబడునది దృఢచిత్తముమాత్రమే. ఈమాయాజాలమునుండి త్రెంచుకొని బయటబడుట కష్టములలోనెల్ల గష్టమైనపని. అద్భుతప్రజ్ఞావంతులకేగాని వట్టివానికి గాదు. అటులైననేమి;

శ్లో॥ పుఙ్ఖానుపుఙ్ఖవిషయానుపసేవమానో
ధీరో న ముఞ్చతి ముకున్దపదారవిన్దమ్;
సంగీతవాద్యగతితానవశఙ్గతోఽపి
మౌళిస్థకుంభపరిరక్షణధీ ర్నటీవ॥ నాధముని.

అధైర్య మొకమతముగాదు. మరొక టగునేమో; ఎల్లప్పుడును సంతోషించుచు చిరునవ్వుతో నుండుట, ఎన్నియోప్రార్థనలకంటె నీశ్వరసాన్ని

ధ్యమును గూర్చును. ఎప్పుడు వ్యాకులభావముతో సోమరిగనుండు హృదయము లెట్లు ప్రేమించును? వారు ప్రేమనుగూర్చిపలికినచో నసత్యమే. వా రితరుల చెరుపజూచెదరు. మతోద్రేకుల (Fanatics) సంగతి జూడుడు. వారు మొగమంతయు గనుల జేసికొందురు. వారి మత మంతయు నితరులతో బ్రతిమాటయందును క్రియయందును పోట్లాడుటయే. వారికిగనుక స్వేచ్ఛయే యొసంగినచో వా రిదివర కేమి యొనర్చిరో, ఏమియొనర్తురో యోచింపుడు. వారి కధికారము హస్తగతము కానున్నచో రేపే ప్రపంచమంతయు రక్తప్రవాహమున ముంచెదరు. అధికారము నాశ్రయించుచు, మొగ మింతచేసికొనుచు, వారి హృదయములలోనుండు నాకాంక్షెముదయనుగూడ పోగొట్టుకొందురు. కావున, ఎల్లపుడును వ్యాకులముగనుండువాడు భగవంతు నెన్నడును చేరడు." "నే నింతకష్టములో నున్నా" నని చెప్పు టొకమతము గాదు. పైశాచికమే. ప్రతిమనుజునకును దగినంత భార ముండియే యున్నది. నీకు కష్టమొదవినచో దానిని జయింపయత్నింపుము. సౌఖ్య మొ[illegible]మర[illegible]

భ[illegible] [illegible]హీనులు చేరుట కష్టము. బలహీనుడ వెన్నటికిని గాకు ఉన్నతవ[illegible]డవుగ నుండుము. నీలో నత్యద్భుతమైనబలము, శక్తి [illegible] దేని నైనను ఏమరాక దానిచే జయింతువు? మరెట్లు భగవంతుని విష[illegible]వు. అదే సమయమున ఉద్ధర్షము, అత్యానందమును విడనాడుము. అటిస్థితిలోనున్న మనస్సున కెప్పటికిని శాంతిలేదు. అది కుమార్గమును బట్టును. అధికహర్షము వెంటనే యధికదుఃఖముగూడ నుండును. ఆనందశోకములకు చాలసమీపసంబంధము. తెలిచుగ జను లతీతమునకుపోదురు. చిత్తమును హర్షమును బొందనిమ్ము గాని శాంతముగ నుంచుము. వాని నతీతమునకును బోనీయకుము. ఏలనన ఎంతసంతసమో యంతదుఃఖము. ఇవి రామానుజులవారిమతానుసారము భక్తికి సాధనలు.

# పరాభక్తి.

౫ అధ్యాయము.

## విగ్రహారాధన.

పిమ్మట విచారించదగినహంశము— ఈశ్వరున కించుమించుగ ప్రత్యామ్నాయముగ నుండుప్రతీకములు, ప్రతిమలు లేక విగ్రహముల యారాధన. అది దృష్ట్యనుసంధానము— "భక్తితో బ్రహ్మగానివస్తువును బ్రహ్మగా భావించుకొని దానిపై చిత్తమును నిలుపుట." రామానుజులవా రిట్లు పలుకుచున్నారు.— "చిత్తమునే బ్రహ్మముగా పూజింపుము. ఇది యాంతరంగికము. ఆకాశమే బ్రహ్మము—యిది భావార్థము." మన స్సొకయాంతరంగికప్రతీకము, ఆకాశ మొక బాహ్యప్రతీకము. ఈరెంటిని ఈశ్వరునకు ప్రత్యామ్నాయముగ పూజించవలసినదే. అటులే "సూర్యుడే బ్రహ్మము యిదియే యాజ్ఞ[illegible]" "ఎవడు నామమును బ్రహ్మముగ నుపాసించునో," —[illegible]ను. లన్నిటిలోను ప్రతీకములయారాధనలో సంశయము గలుగు[illegible] శంకరులవారు పలుకుచున్నారు. ప్రతీక మనుపదమునకు సమీపించ[illegible] యనునర్థము. ప్రతీకారాధనమన్ననో కొన్ని విషయములలో నించు[illegible]చుగ బ్రహ్మకు తుల్యముగనుండుటేగాని బ్రహ్మవస్తువుమాత్రము గాకుండి దానికి ప్రత్యామ్నాయముగ నుండుదానిని పూజించుట. శ్రుతులలో నుదహరించబడినప్రతీకములతోపాటు పురాణములలోను తంత్రములలోను చాలగనుపట్టును. ఈవిధమైనప్రతీకారాధనలో పితృపూజయును, దేవపూజయును జేర్చవచ్చును.

మన మొకవిషయమును బహుజాగ్రత్తగ జ్ఞప్తియం దుంచుకొనవలెను. కొన్నివిషయములలో గలుగునట్లు అత్యున్నతమగు వేదాంతాదర్శము, పరబ్రహ్మము, ప్రతీకారాధనమున ప్రతీకముతో సమానము చేయబడి,

అట్టిప్రతీకమే ఆరాధకునియాత్మ లేక అంతర్యామిగ చేయబడినచో, నాతడు పూర్తిగ దప్పుత్రోవనబోయినవాడే. ఏలనన, ఆరాధకుని యాత్మ ఏప్రతీకమును నిజముగ గాజాలదు. గాని, ఎచట బ్రహ్మమే యారాధకవిషయమో, ప్రతీకము ప్రత్యామ్నాయముగ, సూచనగ మాత్రమేయుండెనో అనగా, ఎచట ప్రతీకముద్వారా సర్వవ్యాపియగు బ్రహ్మము ఆరాధించబడునో—ప్రతీకమే సర్వమునకు కారణభూతమని బ్రహ్మమని గైకొనబడెనో (కల్పించబడెనో) అచ్చట నాయారాధన నిస్సంశయముగా లాభదాయకమే. ఇంతియెగాక, ఆరాధకులచిత్తమారాధనలో ప్రథమ లేక సిద్ధావస్థను దాటువరకును మానవకోటి కంతటికి నత్యంతావశ్యకము. కావున, ఏదైన దేవతగాని తదితరము పూజింపబడినపుడు అట్టిది కర్మకాండకు చెందును. అది యొకవిద్యగా (Science) నట్టివిద్యకుమాత్రమే చెందిన ప్రతిఫలమును మాత్రమే యివ్వగలదు. కాని, దేవతలుగాని తదితరములుగాని బ్రహ్మముగా నెంచబడి పూజింపబడినచో, వచ్చెడిఫలితము ఈశ్వరారాధనవలనవచ్చెడి దానితో సమానమే. అనేకవిషయములలో శ్రుతిస్మృతులలో దేవతగాని, ఋషిగాని, తదితరసామాన్యజీవిగాని దానిసామాన్యావస్థనుండి ఉన్నతముగజేయబడి బ్రహ్మముగ సూచింపబడి పూజింపబడుట నిది వివరించును. అద్వైతి యిట్లనును:— "నామరూపములు దానినుండి తొలగించినచో ప్రతివస్తువును బ్రహ్మముగాదా? యని. విశిష్టాద్వైతి "ఫలమ్ ఆదిత్యాద్యుపాసనేషు బ్రహ్మైవ దాస్యతి సర్వాధ్యక్షత్వాత్" ఆదిత్యులయొక్క యారాధనఫలమునుగూడ బ్రహ్మము సర్వాధ్యక్షుడు గాన నిచ్చుచున్నాడు.

బ్రహ్మసూత్రభాష్యములో శంకరులవా రిట్లుచెప్పుచున్నారు.

> "ఈదృశం చాత్ర బ్రహ్మణ ఉపాస్యత్వం యతః ప్రతీకేషు
> తద్దృష్ట్యాధ్యారోపణం ప్రతిమాదిషు ఇవ విష్ణ్వాదీనాం."

---

(6)

# పరాభక్తి.



౬ అధ్యాయము.

## మంత్రము; ఓంకారము, శబ్దము, జ్ఞానము.

మన మాలోచించవలసిన మరొకవిషయము మహాపురుషులవిషయము గాక సిద్ధగురువులదై యున్నది. వారు శిష్యులకు మంత్రము ద్వారమున ఆధ్యాత్మికజ్ఞానము నుపదేశింపవలసియున్నది. ఈమంత్రము లెవ్వి? భారతీయవేదాంతము ననుసరించి సృష్టియంతయు నామరూపాత్మకమైయున్నది. సూక్ష్మాంశములో నామరూపములకు లోబడనిచిత్తవృత్తియే యుండబోదు. ఈప్రకృతియంతయు నొకేపద్ధతిపై నిర్మింపబడిన విషయమే నిజమైనచో, ఈమహాసృష్టియంతయుగూడ నామరూపాత్మకమగుటగూడనిజమే.

"యథా ఏకేన మృత్పిండేన విజ్ఞాతేన సర్వం విజ్ఞాతం భవతి.

ఎట్లు ఒక మంటికణమును ఎఱింగిన సర్వము నెఱుంగబడినట్లగునో"

అట్లే సూక్ష్మపదార్థజ్ఞానము మహత్పదార్థజ్ఞానమునకు గొనిపోకతప్పదు. నామముగాని, భావముగాని ఆంతరంగికవస్తువు, రూపము బాహ్యవస్తువు, శరీరము రూపము, చిత్తము లేక అంతఃకరణము నామము; అట్లే శబ్దచిహ్నములు పలుకనేర్చిన అన్నిజంతువులలోని నామముతో గలసి యున్నవి. వ్యక్తిచిత్తములో బుట్టెడిభావతరంగములు మొదట శబ్దములుగను పిమ్మట స్థూలరూపములుగను గనుపట్టును.

విశ్వములో బ్రహ్మ లేక హిరణ్యగర్భుడు లేక జగత్సంబంధమైన మహత్తు స్వయముగా ప్రథమమున నామముగను, పిమ్మట రూపముగను అనగా జగత్తుగను స్పష్టీకరించుకొనెను (ఆవిర్భవించెను). ఈమనయింద్రి

యములకు గోచరమగుప్రపంచమంతయు రూపము, దానివెనుక శాశ్వతమును, వాచామగోచరమగుస్ఫోట లేక శబ్దము నిలచియున్నది. ఈశాశ్వతమగు స్ఫోట భావములకు లేక నామములకన్నిటికి శాశ్వతమును అత్యావశ్యకమునగు పదార్థముయొక్కశక్తినుండియే ఈశ్వరుడీజగత్తును సృష్టించుచున్నాడు. ఇంతియె గాదు. ఈశ్వరుడు మొదట స్ఫోటగ నియమితుడై పిమ్మట దనంతదానే యింద్రియగోచరమును స్ఫుటము నగుఆకారముగలజగత్తుగ పరిణమించును. ఈస్ఫోటకు గుర్తుగనుండుటకు వీలయినపద మొకటిమాత్రమేయున్నది. అదియే ఓంకారము. మనము భావమునుండి పదమును ఏవిధముచేతను విడదీయలేముగాబట్టి, ఈఓంకారమును నిత్యమైనస్ఫోటయును అభేద్యములు. కావుననే యీయతిపావనమగుపదము, యీసమస్తనామరూపములజనని, ఈనిత్యమైనఓంకారమునుండియే సమస్తజగత్తు నిర్మింపబడినదని యనుకొనవచ్చును; గాని భావమును పదమును అభేద్యములైనను, ఆభావమునకే యనేకములగుపదచిహ్నము లుండవచ్చును; గాని, యీసృష్టియంతయు నిర్మింపబడుటకు యోగ్యమైనభావమునకు ప్రతిగనుండుటకే ఓం అను పద మొకటియే తగినదా యనునాక్షేపణ కలుగవచ్చును. ఈయాక్షేపణకు సమాధాన మిది; సమస్తమును నాక్రమించుకొనగలచిహ్న మీఓంకారముమాత్రమే, అట్టిది మరొకటి లేదని. స్ఫోట పదములన్నిటికి ముఖ్యపదార్థము. కాని అది యొకనిర్ధారితమైనపరిపూర్ణ పదము గాదు. అనగా, ఒకపదమునుండి మరొకపదమును విశదపరచుచిత్రకల్పనల నన్నిటిని తొలగించినచో మిగిలినదే స్ఫోట.

కావున నీస్ఫోటను నాదబ్రహ్మమందురు. ఇపుడు వాచామగోచరమైన స్ఫోటను దెలుపుటకు ఏర్పరచబడిన ప్రతిపదచిహ్నమును అది యిక నెంతమాత్రమును స్ఫోటగ నుండదనునట్లుగా వివరించునుగావున నాచి



హ్నము—ఏది యతిమాత్రముగ దానిని వివరించి, దానిస్వభావమును మిగుల సరిగ దెలుపునో—అదియే యథార్థమగుచిహ్నముగ నుండును. ఇదియే ఓంకారము. ఓంకారమునుమాత్రమే. ఏలనన అ ఉ మ్ అను మూడక్షరముల గలిపి ఓం అనిపలికినపుడు, ఆమూడే సమస్తాక్షరముల సాధారణశబ్దములకు చిహ్నముగ నిలచును. అకారము శబ్దములన్నిటిలో భేదింపబడనిది. కావుననే గీతలలో కృష్ణభగవానులు అక్షరాణామకారోస్మి" యనిపలికినది. మరియు స్పష్టముగా నుచ్చరింపబడు శబ్దము లన్నియు నోటిలో నాలుకయొక్క మొదటినుండి చివరకుగల మధ్యప్రదేశములో బుట్టుచున్నవి. అ కంఠ్యాక్షరము. మ ఓష్ఠ్యము. ఉకారము నాలుక మొదటినుండి యారంభమైనవేగము పెదవులవరకు దొరలుచుండుటను సరిగదెలుపును. సరిగనుచ్చరించినచో నీఓంకారము శబ్దవ్యుత్పత్తియంతకు ప్రతిగనుండును. మరొకపద మేదియు నట్లుచేయజాలదు. కావున, నిదియే ఓంకారముయొక్క నిజమగుఅర్థమైనస్ఫోటయొక్క యోగ్యమగుచిహ్నము. సూచనకును, సూచింపబడెడిపదార్థమునకును భిన్నత్వ మెన్నడు నుండజాలకుండుటచే ఓంకారమును స్ఫోటయు నొకటే. మరియు స్ఫోట దృశ్యమగుప్రపంచముయొక్క సూక్ష్మభాగమగుటచే నీశ్వరునకు మిగుల సమీపమగుటయేగాక ఆధ్యాత్మికజ్ఞానముయొక్క ప్రథమావిర్భావమే. ఈఓంకారము సత్యముగ నీశ్వరచిహ్నమే. మరియు నీ "ఏకమేవాద్వితీయం" బ్రహ్మము, "అఖండసచ్చిదానందబ్రహ్మము," అసంపూర్ణమగు మానవాత్మలకు భిన్నభిన్నాదర్శముల వెంబడి భిన్నగుణములతో గూడియున్నట్లు ఏవిధముగా భావింపబడినదో, అట్లే ఈజగత్తు ఆయనశరీరము భక్తునిభావముల వెంబడి యోచింపబడవలెను. ఉపాసకుని మనోమార్గము ఆతనిలో బ్రబలుచుండెడి తత్వముల ననుసరించి పోవుచుండును. ఫలితము, ఆఈశ్వరుడే భిన్నగుణములను గలిగియుండు పలువిధములగు రూపములతో

నున్నట్లు గనుపట్టును. అదే జగత్తు అనేకరూపములతో నున్నట్లు గనుపట్టును. మిక్కిలి యభేద్యమును, సర్వసామాన్యము నగు ఓంకార చిహ్నము విషయములో భావమును, శబ్దచిహ్నమును ఒకదానికొకటి విడదీయలేనంతగ గనుపట్టినట్లే వానియొక్క యాయవిభాజ్యసంబంధ చట్టము ఈశ్వరుడు జగత్తుయొక్క భేదభావములకుగూడ వర్తించును. వానిలో బ్రతిదానిని దెలుపుట కొక్కొక్క ప్రత్యేకపదచిహ్నముండ వలెను. ఋషులయొక్క లోతైనఆధ్యాత్మికసందర్శనములనుండి వెలువడిన ఈపదచిహ్నములు వీలయినంతస్ఫుటముగా వానియొక్క బింబములైన ఈశ్వర, జగత్తులస్వరూపమును, విశదపరచును. ఓంకారమఖండబ్రహ్మమును దెలుపునట్లు తదితరములు అదే యీశ్వరునియొక్క ఖండస్వరూపములను దెలుపును. అవన్నియు నీశ్వరధ్యానమునకును, యథార్థజ్ఞానసంపాదనమునకును సహకారులగును.

ఈఓంకార మీసమస్తప్రపంచముయొక్క లేక ఈశ్వరునియొక్క నామమునకు బదులుగనున్నది. బాహ్యప్రపంచమునకును, ఈశ్వరునకును మధ్యస్థమై రెంటికి ప్రతినిధిత్వమును వహించును. కాని, యెప్పుడు మనము ప్రపంచమును ఖండఖండములుగ బహువిధేంద్రియముల ననుసరించి స్పర్శము, వర్ణము, రుచి, మరియు ననేకమార్గములలో గైకొనగలము. ఈప్రపంచమును భిన్నభిన్నలక్ష్యములవెంబడి కోట్లకొలది స్వయంపూర్ణముగను, నామరూపచింతనాసహితముగ నుండుప్రపంచములుగ జేయగలము. ఈవెనుకనుండుచింతనలే ప్రతీకములు. ప్రతిదానికి నామము గలదు. ఈపవిత్రచిహ్నములు నామములు భక్తియోగములో నుపయోగింపబడినవి. వాని కనియమితశక్తి గలదు. ఈమాటలయొక్కనిరంతరోచ్చారణచేతనే మనకోరిక లీడేరగూడును. మనము పరిపూర్ణులము కాగలము; గాని రెండువిషయము లావశ్యకములు.



"శ్రవణాయాపి బహుభి ర్యో న లభ్యః
శృణ్వంతోపి బహవో యం న విదుః
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥"

గురువు అద్భుతప్రజ్ఞావంతుడు గావలెను. శిష్యుడుగూడ నట్లేయుండవలెను — అని కఠోపనిషత్తు చెప్పుచున్నది. అట్టినామము సరియగు పారంపర్యముగ సిద్ధించినమానవునినుండియే రావలెను. గురువునుండి శిష్యునకు ప్రాచీనకాలమునుండి యత్యంతశక్తితో నాధ్యాత్మికప్రవాహము వచ్చుచున్నది. ఈపదము (ఉపదేశము) ఎవనినుండివచ్చునో యాతడు గురువు, ఎవనికిబోవునో వాడు శిష్యుడు. ఈపదములను క్రమముగ గైకొని జపించినచో భక్తియోగములో జాలవరకభివృద్ధిజెందినట్లే. ఆపదముయొక్క నిరంతరోచ్చారణమాత్రముననే భక్తియొక్క ఉన్నతస్థితి వచ్చును.

గీ॥ ఎన్నియో నామములతోడ నిన్నెఱుగక
భిన్నదైవతంబుచు దలచియు బిలచుచున్న
నంతమాత్ర జనునె నీయనంతశక్తి
భక్తులను బెక్కుత్రోవల బడయుచుందు.
ఆత్మ నీయందె నిరతంబు నవశమొంది
యుండుటకు కాల మొక్కటి యుండవలెనె
వ్యవధియే లేదు నాకు నీస్మరణజేయ
అతిపవిత్రంబు కాలావకాశమంత
నీవె కరుణాసముద్రుడ వీవె రక్ష
భక్తజనములపాలిటి పరమనిధివి
పొంద భక్తుల కతిసులభుడవెగాని
ఏమనందును నాపాపమిట్లుపండె
నాదుచిత్తము నీయందె నాటుకొనదు.

---

# పరాభక్తి.

౭ అధ్యాయము.

## ఇష్టము.

---

శ్లో॥ త్రయీసాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి,
ప్రభిన్నే ప్రస్థానే పర మిద మతః పథ్య మితిచ,
రుచీనాం వైచిత్ర్యం ఋజు కుటిలనానాపథజుషాం,
నృణా మేకో గమ్యః త్వమసి పయసా మర్ణవఇవ ॥

ప్రతిమతములోని ప్రతితెగయును స్వీయమతాదర్శములనుమాత్రమే మానవకోటియెదుట నుంచును. కాని శాశ్వతమగు వేదాంతమతమో మానవకోటికి దైవికాయతనములోనికి బోవుటకు మితిలేనిద్వారముల దెరచియుంచి, ఆనేకమును, అనంతము నగుపరబ్రహ్మస్వరూపపూరితమైన యాదర్శముల నపరిమితముగ నుంచియున్నది. దయారసపూర్ణమగు వేదాంతమతము ముముక్షువులగు స్త్రీపురుషులకు ప్రతిభావంతులును, అవతారమూర్తులు నగునార్యపుత్రులచే ప్రస్తుతమునను, పూర్వమునను మానవజీవితమున ననుభవసిద్ధమును, అచంచలము నగుతత్వమునుండి కనుగొనబడినయనేకమార్గములను జూపుచు, సమస్తమైన వారలను—భవిష్యత్ప్రజలనుగూడ—జీవాత్మమాయాపాశములనుండి విడివడి పరిపూర్ణస్వేచ్ఛతో శాశ్వతానందమున నోలలాడునట్లుగ నాస్వధామమునకు ఆనందసాగరమునకు రమ్మనిపిలచుచు దనహస్తములజాచి నిలచియున్నది.



కావున, భక్తియోగము మోక్షమునకు గొనిపోయెడిభిన్నమార్గములలో దేనినైనను ద్వేషించకుండుటకును, కాదనకుండుటకును మనకు విధాయకమగునాజ్ఞ నొకదానినొసంగియున్నది. ఐనప్పటికి మొలచెడి మొక్కకు బెరిగి పెద్దవృక్షమగువరకును చుట్టు కంచెవేసి కాపాడవలెను. ఈయాధ్యాత్మికాంకురము బాల్యముననేఎడతెగని భావాదర్శపుమార్పులకు వదలినచో జచ్చిపోవును. అనేకులుమతౌదార్యమని (Religious liberation) పేరుపెట్టుకొని తమయులసభావతృప్తికై యొకదానిని వదలి మరొకదానిని, యిట్లనేకమతముల నవలంబించుట జూచుచున్నాము. వారికి నూతనవిషయముల వినుట యనున దొకవిధమగు వ్యాధిగ, మతసంబంధమగునిషాగా మారును. వారికించుక భావోద్రేకము గలుగుటకై కొంచెము నవీనవిషయముల వినుట యావశ్యకము. దాని యనుభవ మొకపరియైన వెంటనే మరొకదానికి సిద్ధము. వీరికి మత మొకవిధమగునల్లమందు తినుటవంటిది. అంతతో నది యంతమొందును. భగవానుడగు శ్రీరామకృష్ణుడు కథలోనిముత్యపుచిప్పవంటి మనుజుడు మరొకడు గలడని పలుకుచున్నాడు. “ముత్యపుచిప్ప స్వాతికార్తెలో దనసముద్రాంతర్భాగస్థితిని వీడి వర్షబిందువుల గ్రోలుటకై పైకివచ్చును. అది బిందువును గ్రోలువరకు నోరుదెరచుకొని నీటిపై దేలుచుండి బిందువు పడినవెంటనే యంతర్భాగముననున్న తననివాసస్థానమును బొంది యచ్చట నాబిందువు మంచిచక్కనిముత్యమగువరకు నివసించును.” “ఇష్టనిష్ఠా” సిద్ధాంతమును విశదపరచునట్టిబలమైన, ఛందోబద్ధమైనయథార్థమార్గ మిదియే. ఈ “ఏకనిష్ఠ” లేక “ఏకాదర్శమునందు భక్తికలిగియుండుట” భక్తియోగమునందలి ప్రారంభకునకు అత్యంతావశ్యకము. ఆతడు రామాయణమున హనుమంతుడు చెప్పినట్లు

క॥ ధరణిజసిరిపతు లొకటే పరమేశ్వరునంశలనుచు భావించినను౯
వరదుడగు రామచంద్రుడు సరసిజనేత్రుండె నాదు సర్వస్వముగు౯.

చెప్పవలెను. లేక తులసీదాసు చెప్పినట్లు,

"అన్నిటిలో నుండుమాధుర్యము గొనుము. అందరితోడను గూడియుండుము, అందరినామములను గొనుము, అవునని పల్కుము గాని, నీస్థానమునుమాత్రము స్థిరముగ నుంచుకొనుము" చెప్పవలెను. పిమ్మట నాతడు దృఢభక్తుడైనచో నీయావగింజనుండియే భారతీయవటవృక్షమువలె గొమ్మవెంట కొమ్మను, వేరువెంట వేరును నలుప్రక్కలకు బంపి సమస్తమతావకాశము నాక్రమించుకొనెడి మహావృక్ష మొకటి యుద్భవించవచ్చును. ఆవిధముగ యథార్థభక్తుడు తనజీవితములో తనయాదర్శరూపమే యన్నితెగలచేతను, పలునామములతో సమస్తరూపముల నైకొని భిన్నాదర్శములతో బూజింపబడుచున్నాడని యెఱుంగగలడు.

మొదటిభాగము సమాప్తము.





శ్రీరామకృష్ణాయ నమః.

# పరాభక్తి.

## రెండవభాగము.

### ౧ అధ్యాయము.

## సిద్ధావస్థయందలి త్యాగము.

సిద్ధ (గౌణి) భక్తియననేమియో నింతవరకు యోచించితిమిగావున పరాభక్తినిగురించి చదువ మన మిపుడు యత్నింతము. పరాభక్తి నలవరచుకొన నేమిసిద్ధపరచుకొనవలెనో దానినిగూర్చి పలికెదము. అట్టిసిద్ధము చేయుట లన్నియును చిత్తశుద్ధికిమాత్రమే యావశ్యకములు. నామోచ్చారణ, ఆచారములు, ప్రతిమలు, చిహ్నములు, యివన్నియు చిత్తశుద్ధికొరకే. అట్టిపవిత్రీకరణములలో నుత్తమమును, పరాభక్తిసీమల బ్రవేశించుట కత్యావశ్యకసాధనమగునది త్యాగము. దీనిపేరువిన్న జాలమంది భీతులగుదురు. కాని, యిది లేకుండ నేమాత్రమాధ్యాత్మికాభివృద్ధియే యుండదు. మనయోగము లన్నిటిలో నీత్యాగ మత్యావశ్యకము. ఈత్యాగ మాధ్యాత్మికజ్ఞాన మంతటికిని మెట్టురాయి, (సాధనము), యథార్థకేంద్రము, నిజమగు హృదయము. ఇదియే మతము— త్యాగము. మానవాత్మ ప్రాపంచిక వ్యవహారము

లనుండి వెనుదిరిగి గూఢవిషయములలో దిగ యత్నించునప్పుడు మనుజుడు, ఎటులో యిచట మూర్తిని వహించిన శక్తి, దానివలన తాను కేవలము జడపదార్థముగ నొనర్చబడి వినాశముబొందెద ననిగుర్తెఱింగి యాజడమునుండి విముఖుడైనపుడు— అపుడే త్యాగము, యథార్థముగు నాధ్యాత్మికాభివృద్ధి ప్రారంభించును. కర్మయోగియొక్క త్యాగము తన సమస్త కర్మలయొక్క ఫలమును ద్యజించుటలోన గలదు. తనకర్మల ప్రతిఫలముతో నాతనికి సంబంధము లేదు. ఇచటగాని మరెచటగాని యేవిధమైనబహుమతికిగాని యాశపడడు. రాజయోగి యీప్రకృతియంతయు నాత్మకు స్వానుభవమునకేర్పడినదనియు, యీయాత్మానుభవము యొక్క ఫలితము తా నీప్రకృతినుండి శాశ్వతముగ భిన్నవస్తువని తెలుసుకొనుటయేయని ఎఱుంగును. మానవాత్మ తాను అనంతముగ జడముగాక శక్తిననియు, ప్రకృతితోడనసంబంధము కొంతకాలమువరకుమాత్రమే యుండును, ఉండగలదనియు ఎఱుంగవలసియుండును. రాజయోగి ప్రకృతినుండి తనస్వానుభవమువలన త్యాగపాఠమును నేర్చుకొనును. జ్ఞానయోగిమాత్రము ప్రథమమునుండియే యీమానచర్మచక్షువులకు గనుపడుప్రకృతి సమస్తమును పట్టిభ్రమయేయని ఎఱుంగుటకుగాను మిగులకఠినమగుత్యాగమార్గము నవలంబింపవలెను. ప్రకృతిలో నన్నివిధములగుశక్తివిజృంభణములును ఆత్మకేగాని ప్రకృతికి చెందవని యాతడెఱుంగవలెను. మొదటినుండియు సమస్తజ్ఞానమును అనుభవమును, ప్రకృతిలోగాక యాత్మయందేయున్నవని ఎఱుంగవలెను. గావున నాతడు వెంటనే తన కేవలవివేకవిశిష్టమైన నమ్మకపుశక్తిచే ప్రకృతిదాసత్వమును భేదించవలెను. ఆతడు ప్రకృతిని దానికిసంబంధించినసమస్తమును బోపిడి, వానినదృశ్యముగానిచ్చి తానొక్కడే నిలచియుండుటకు యత్నించును.




త్యాగము లన్నిటిలో మిక్కిలిస్వాభావికమైనది భక్తియోగిదే. ఇచట దౌర్జన్యము లేదు, త్యజించవలసినది లేదు, మననుండి భేదించవలసినది లేదు, మనము దౌర్జన్యముగ విభిన్నులముగావలసినది లేదు. భక్తుని త్యాగము తేలిక, నెమ్మది, ప్రవహించునది, మనపరిసరములవస్తువులవలె స్వాభావికమైనది. ఈవిధమగుత్యాగవిజృంభణ మించుమించుగ వికారమగుచిత్రవర్ణనలలో ప్రతినిత్యము మనచుట్టును జూచెదము. ఒకడొకస్త్రీని ప్రేమింప నారంభించును; కొంతకాలమైనపిదప మరొకదానిని ప్రేమించి మొదటిదానిని వదలివైచును. ఆమె యాతనిమనమునుండి మెల్లగ నాతని కిసుమంతయు నగత్యము లేకయే యదృశ్యమగును. ఒకస్త్రీ యొకపురుషుని ప్రేమించును. కొంతకాలమునకు మరొకనిని ప్రేమించి మొదటివానిని చల్లగ జారవిడుచును. ఒకమనుజుడు తనపట్టణమును ప్రేమించును. పిమ్మట తనదేశమును ప్రేమింప నారంభించును. తనపట్టణమందుగలఉత్కృష్టప్రేమ మెల్లగ జారిపోవును. మరల ఒకడు సమస్తప్రపంచకమును ప్రేమించనేర్చుకొనును. తనదేశమందలిప్రేమ యత్యధికమును మూర్ఖమునగుదేశాభిమానము దౌర్జన్యచిహ్నములు లేకుండనే, కీడుచేయకయే యాతనినుండి సన్నగిల్లును. అజ్ఞానియగువాడు విషయసుఖముల నధికముగ ప్రేమించును. జ్ఞానమలవడినకొలది వైజ్ఞానికసౌఖ్యముల ప్రేమించ నారంభించును. అంత విషయవాంఛలు తగ్గిపోవును. ఆహారమును కుక్కగాని తోడేలుగాని లొట్టలువేయుచు తినునట్లు మానవుడు తినజాలడు. కాని, జ్ఞానానుభవములవలన మానవుడు సంపాదించెడిసౌఖ్యముల కుక్కలెన్నటికిబొందజాలవు. మొదట సౌఖ్యములు నీచేంద్రియములతో సంబంధముగలవి. కాని, జంతువు ఉన్నతస్థితిని బొందినపుడు, నీచసౌఖ్యములపట్టు తగ్గిపోవును.

మానవసంఘములో మానవుడు పశుసమీపగతు డెంతగనైన నంతగ విషయానందముల నోలలాడగోరును. మానవునిజ్ఞాన మెంతగ నధికమైన నంతగ విజ్ఞానము మొదలగు విషయముల నాతని యానందమభివృద్ధిపొందును. గావున, మనుజు డెపుడు విజ్ఞానముకన్న, వట్టియోచనకన్న మిన్నయగు స్థానమున నుండునో, ఆతని కెన్న డాధ్యాత్మికత్వమును, దైవికోద్బోధమును కలుగునో, ఆతె డచ్చట విషయసౌఖ్యములును వైజ్ఞానిక సౌఖ్యములును ఎందునకును గొరగానట్టి యానందధామమును పొందును. చంద్రుడు పరిపూర్ణకళలతో ప్రకాశించునపుడు నక్షత్రము లన్నియు కాంతివిహీనము లగును. సూర్యుడు ప్రకాశించునపుడో చంద్రుడు కళాహీనుడగును. భక్తిని బొందుట కావశ్యకమగు త్యాగము దేనిని జంపినను గలుగదు. కాని, ఒకక్రమముగ నభివృద్ధిపొందు పెద్దదీపము వెలుగున చిన్నచిన్న వెలుగులుగల దీపములు క్రమేణ కాంతిహీనములై కడకు బూర్తిగ నదృశ్యములగు రీతిగనే స్వభావసిద్ధముగ నదియే వచ్చును. ఈవిషయవాంఛానందము విజ్ఞానానందము ఈశ్వరప్రేమవలన కళాహీనముగ చేయబడి (మందగింపబడి) బొత్తుగ ద్రోసిపార వేయబడును. ఆఈశ్వరప్రేమ యభివృద్ధియై పరాభక్తియనునవస్థను బొందును. ఆచారకాండ యంతరించును. గ్రంథము లావలబడును. విగ్రహములు, దేవాలయములు, మఠములు, మతములు, తెగలు, దేశములు, జాతులు నీ మొదలగు చిన్నచిన్నప్రతిబంధములు, దాస్యము లన్నియు నీయీశ్వరప్రేమను గుర్తెఱిగినవానినుండి తమంతట దామే స్వభావసిద్ధముగ జారిపోవును. ఆతని స్వాతంత్ర్యము నరికట్టుటకుగాని, బంధించుటకుగాని నేమియు నుండదు. ఒకయోడ హఠాత్తుగ పెద్దసూదంటురాయివద్దకు వచ్చును. దానియందు బిగింపబడినకొక్కెములు, మేకులు, కడ్డీలు, సమస్తము నాక



ర్షింపబడి బయటికి లాగివేయబడును. వెంటనే చెక్కలన్నియు వదలిపోయి స్వేచ్ఛగ నీటిపై దేలియాడును. ఈశ్వరకరుణగూడ నావిధముగ నాత్మయొక్క ప్రతిబంధముల నన్నిటిని విడగొట్టును. అంత నది స్వాతంత్ర్యమును బొందును. భక్తికి సహాయము నగు నీత్యాగమున కఠినత లేదు. సారహీనత లేదు. శ్రమ లేదు. అణగద్రొక్కుట గాని బాధించుటగాని లేదు. భక్తు డాతనిభావములలో దేనినిగాని యణచుకొన నగత్యము లేదు. వాని నాత డభివృద్ధిపరచి ఈశ్వరమార్గమున పెట్టుటకుమాత్రమే యత్నించును.



# పరాభక్తి.



౨ అధ్యాయము.

## భక్తునిత్యాగము ప్రేమయొక్కఫలితము.

ప్రకృతిలో బ్రతిచోటను మనము ప్రేమను చూచెదము. సంఘములో నేది గొప్పగను, మేలుగను, గంభీరముగనున్నదో యదంతయు నా ప్రేమ యొక్క చర్యయే. సంఘములో నేయేకీడుగలదో అదిగూడ యా (ప్రేమ) అనురాగముయొక్క కుమార్గచర్యయే. భార్యాభర్తలనడుమనుండు పవిత్రమును, వివాహసంబంధమునగు ప్రేమయు, నీచమగుపశుసౌఖ్యముల కగుప్రేమ నిచ్చెడిదియుగూడ నీభావోద్రేకమే (Emotion). భావ మేమా యొక్కటే; దానివిజృంభణముమాత్రము భిన్నవిషయములలో భిన్నభిన్నముగనుండును. అదే ప్రేమానుభవము. సన్మార్గమున నిడిన తనసర్వస్వము ధారవోసి బీదలకు మేలుచేయవలెననెడిభావమును బుట్టించును. కుమార్గమున నిడిన తనసాటిసోదరులకుత్తుకలే కత్తిరింప జేసి వారిసర్వస్వముల లాగుకొనునట్లొనర్చును. మొదటివా డెంతగ పరులను ప్రేమించునో, రెండవవా డంతగ దనను తాను ప్రేమించును. రెండవవానివిషయములో ప్రేమ కుమార్గమునుబట్టినది. మొదటివానిది సన్మార్గమును బట్టినది. మన కాహారమును వండునట్టినిప్పు పిల్లదానిని దహింపవచ్చును. అట్లుచేసినచో నది యగ్నితప్పుగాదు. భేద మానిప్పును వాడుటలో నున్నది. కాన ప్రేమ, సహవాసముచేయుదమను అత్యంతమగుకోరిక, యిద్దరికిలేక అందరి కేకమగుదమను, ఏకములో లీనమగుదమను, గట్టియభిలాష కొంచెముగనో గొప్పగనో సర్వత్ర కనుపట్టుచునేయున్నది.



భక్తియోగ మున్నతప్రేమయొక్క శాస్త్రము. అది దాని నెట్లు నడుపవలెనో చూపును. దాని నెట్లు మనచేతిక్రింద నుంచుకొనవలెనో, ఎట్లు నిర్వహించవలెనో, ఎట్లుప్రయోగించవలెనో, ఎట్లునూతనలక్ష్యముల నిచ్చి యఖండమగుప్రతిఫలమును బొందవలెనో, అనగా మన కాధ్యాత్మికానందము నిచ్చునట్లు ఎట్లుచేయవలెనో మనకు జూపును. భక్తియోగము "త్యజించు" మనిపలుకదు. అది "ప్రేమించుము, ఉన్నతమగుదానిని ప్రేమించుము" అనిపలుకును. ఈయున్నతపదవిని ఎవడుప్రేమించునో వానికి నీచమగువానియందుండెడిప్రేమ స్వభావసిద్ధముగ జారిపోవును.

"నాకామితమనితప్ప నిన్ను మరొకవిధముగ జెప్పజాల.
సౌమ్యా! సౌమ్యతరా!! అశేషసౌమ్యా !!!
అప్యస్త్వతిసున్దరా !!!!
నీవు సుందరుడవు. ఓహో! నీవే సుందరుడవు! సౌందర్యమే నీవు."

ఈయోగమున మనకు నిజముగ గానబడినది ఏమన, సుందరవస్తువుల యెడగల మనవిదాహము నీశ్వరునియెడ చూపవలెను. నరునిముఖమునను, ఆకసమునను, తారకలలోను, చంద్రునియందును నేమియందమున్నది? అది సర్వాలింగనచణమైన దైవికసౌందర్యముయొక్క ఒకభాగమే.

న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోయ మగ్నిః
తమేవ భాన్త మనుభాతి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి॥ కఠోప.

అతడు వెలుగుచుండగా సమస్తమును వెలుంగును. అతనిప్రకాశముననే సమస్తవస్తువులు వెలుంగును.

నీయొక్క సంకుచిత భావముల నన్నిటిని వెంటనే మరువజేసెడి యీయత్యున్నతమగు భక్తిని గైకొనుము. ఈప్రపంచములోని స్వల్పమగు స్వార్థవిషయములనుండి దూరముగ దొలంగుము. మానవకోటినే నీసమస్తోన్నతలాభములయొక్క కేంద్రముగ నెంచుకొనకుము. ఒకసాక్షిభూతుడవుగ, విద్యార్థివిగ నుండి ప్రకృతిలీలను గమనించుచుండుము. మానవునితో సంబంధములేదనుకొని యీగొప్పప్రేమానుభవము తనంత తాను ప్రపంచములో నెట్లుపనిచేయుచున్నదో చూడుము. కొన్నివేళల కొద్దికొద్దిగ సంఘర్షణాలు జరుగవచ్చును. కాని యది యథార్థమగు నున్నతప్రేమ పొందుట కగుకలతలలోన మాత్రమే. కొన్నివేళల చిన్నకలత లుండవచ్చును. పతనము కలుగవచ్చును. కాని యదంతయు మార్గవశముననే. నీవు తొలగియుండుము. సంఘర్షణల నన్నిటిని స్వేచ్ఛగ రానిమ్ము. నీవీప్రపంచప్రవాహమున నున్నంతవరకే యీసంఘర్షణలపొందుదువు. కాని నీవు దానికి దూరముగ కేవలసాక్షిమాత్రుడవుగ, విద్యార్థివిగ నున్నపుడు మాత్రము ఈశ్వరుడు తానే ప్రేమరూపిగ విజృంభించెడి మార్గములు కోటానకోట్లున్నవని చూడ శక్తుడవగుదువు.

శ్లో॥ యా యా ప్రకృతి రుదారా,
యో యో ఒ ప్యానందసుందరో భావః,
యదపిచ కించి ద్రమణీయం
వస్తు శివ స్తత్తదాకారః ॥

ఏదైనయానంద మెచటనైన నున్నచో — అధికమగునింద్రియవిషయములనే గానిండు — అచట ఆయీశ్వరుడగు శాశ్వతానందముయొక్కరవ్వ యున్నది.



నీచమగు నాకర్షణములందును దైవికప్రేమయొక్కకణ మున్నది. సంస్కృతమున హరియన నీశ్వరునినామము. దీనికర్థ మాతడు సమస్తము నాతనికడకు ఆకర్షించు నని. మానవహృదయముల నాకర్షింపదగినవా డాయనయే. ఆత్మ నెవఁడు నిజముగ నాకర్షింపగలడు? ఆతడొకడుమాత్రమే ! జడపదార్థ మెన్నఁడైన ఆత్మను నిజముగ నాకర్షించుననితలంతువా? పూర్వ మెన్నడును జేయలేదు. ముందు జేయబోదు. మనుజు డెవడైన సుందరముఖము వెంట బడిపోయినచో నాతని నాకర్షించునది ఆముఖమునందలిభౌతికాణువులని తలంతువా ? ఎన్నటికిని గాదు. ఆభౌతికాణువులవెనుక నాధ్యాత్మికశక్తి, దైవికప్రేమయొక్కలీల యేదో యుండితీరవలె, ఉన్నదిగూడ. అజ్ఞాని దాని నెఱుంగడు. ఐనను తెలిసియో, తెలియకయో దానిచేతనే యాతడాకర్షింపబడుచున్నాడు. కావున నతినీచమగు నాకర్షణవిషయములు వానిశక్తి నీశ్వరునుండియే పొందును

“ నవా అరే ! పత్యుః కామాయ పతిః ప్రియో భవతి
ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి ”

ప్రియా ! ఎన్నడును, ఎవరును, భర్తను భర్తకొరకు ప్రేమించలేదు. అంతర్యామియగు నీశ్వరుని ఆత్మకొరకే భర్త ప్రేమపాత్రు డగుచున్నాడు.॥

ప్రేమాస్పదురాండ్రగు భార్యలు దీని నెఱుంగవచ్చును; ఎఱుంగకపోవచ్చునుగాని అంతయు యథార్థము.

“ నవా అరే! జాయాయై కామాయ జాయాప్రియో భవతి,
ఆత్మనస్తు కామాయ జాయాప్రియో భవతి, ”

ప్రియా ! ఎన్నడును, ఎవరును భార్యను భార్యగ ప్రేమించరుగాని ఆభార్యలోనుండు ఆత్మకొరకే యామె ప్రేమించబడుచున్నది. అదే

విధముగ బిడ్డలనుగాని ప్రపంచమున మరేపదార్థమునుగాని యంతర్యామి యగునాతనికొఱకుదప్ప మరెందునకును ప్రేమింపరు. ఈశ్వరు డొకగొప్పసూదంటురాయి. మనమందర మినుపముక్కలము. మనము నిరంతర మాయునచే నాకర్షింపబడుచున్నాము. మనమందర మాయ నను జేర దన్నుకలాడుచున్నాము. ఈప్రపంచములోని యీమనశ్రమ యంతయు నిజముగ స్వార్థమునకు గాదు. అజ్ఞానులు వారేమి చేయుచున్నారో యెఱుంగరు. వారిజీవితకార్యము తుదకు ఆగొప్పసూదంటురాయిని చేరుటకే. జీవితమున నీఘోరమగుశ్రమ, కొట్లాట, ఆయన వద్దకు అంత్యమునకు చేరి యాతనిలో నైక్యమగుటకు నిర్ణయింపబడినదే.

ఎట్లైనను భక్తియోగి జీవితసంకటములయర్థము నెఱుంగును. ఆతడు దానిని గ్రహించును. ఈసంకటపరంపరల నెన్నిటినో దాటెను. వాని యర్థమేమో యెఱుంగును. వానివలనిసంఘర్షణములనుండి స్వేచ్ఛను బొందుటకు జాలగగోరును. ఆత డాటంకములనన్నిటిని మీఱి సమస్తమునకు కేంద్రమగు నాహరియొద్దకు సూటిగబోఁగోరును. ఇదియే భక్తునియొక్క త్యాగము. ఈశ్వరునియెడ నుండెడియీగొప్పయాకర్షణము మముందర తదితరముల నుండునవన్నియు నదృశ్యములగును. ఈయుత్కృష్టమును, అపరిమితము నగునీశ్వరప్రేమ యాతనిహృదయమున జొచ్చి యచ్చట మఱెట్టిప్రేమను వసింపనివ్వదు. ఇట్లుగాక మఱెట్లగును? భక్తి యాతనిహృదయమును, ఈశ్వరుడే యగుప్రేమసముద్రముయొక్క దైవికజలములచే నింపును. అచ్చట స్వల్పప్రేమలకు స్థానము లేదు. అనగా భక్తునిత్యాగము అనురాగము లేక యీశ్వరసంబంధముయొక్క ప్రతిఫలమగు ఈశ్వరేతరములయెడ సంబంధరాహిత్యము లేక వైరాగ్యమై యున్నది.



పరాభక్తిని బొందుట కిదియే యాదర్శరూపకమైన సాధన. ఈత్యాగము సిద్ధించినపుడు ఆత్మ పరాభక్తియొక్క ఉన్నతపథమును ప్రవేశించుటకు మార్గము తెరువబడును. అపుడే పరాభక్తి యన నేమియో, మనము గ్రహింప నారంభింతుము. పరాభక్తియొక్క యాంతరంగికపీఠమును బొందినవాడే యాధ్యాత్మికానుభవమునకు సహకారములుగ నీప్రతిమలు, ఆచారవ్యవహారములు నిరుపయోగము లని చెప్పుటకర్హతగలడు. ఆతడే మానవసోదరత్వ మనిపిలువబడు సామాన్యమగు ఉత్కృష్టప్రేమస్థానమును బొందినవాడు. తక్కినవారు పదరుట మాత్రమే. భేదము లాతని కేమియు గనుపడవు. ప్రేమసముద్ర మాతనిలో బ్రవేశించినది. మనుజునిలో మానవుని గాంచడు; గాని సర్వత్ర తనప్రేమైకమూర్తినే చూచును. ప్రతిముఖములోను దన హరియే ప్రకాశించును. సూర్యునిలోను జంద్రునిలోనుండు వెలుగు ఆతని విజృంభణమే. ఎచ్చటెచ్చట సౌందర్యముగాని గంభీరతగాని యుండునో యదంతయు నాతనిదే. అట్టిభక్తు లింకను జీవించియున్నారు. ప్రపంచ మట్టివారు లేక యెన్నడు నుండదు. అట్టివారు సర్పముచే గరువబడియు దనప్రేమమూర్తినుండి యొకదూతమాత్రమే తమయొద్దకు వచ్చె ననెదరు (నాగమహాశయులవలె). అట్టివారు మాత్రమే సర్వజనసోదరభావమునుగూర్చి పలుక నర్హులు. వారికి రోషమను మాటయే లేదు. వారిమనస్సులలో ద్వేషముగాని యసూయగాని యుండదు. వారికి బాహ్యము, విషయసంబంధము శాశ్వతముగ నశించినది. అవనికవెనుకనుండు సత్యమును దమప్రేమగుండ సదా చూడగలిగినట్టివారికి కోప మెట్లుండును?

# పరాభక్తి.

3 అధ్యాయము.

## భక్తియోగముయొక్క స్వభావసిద్ధత.

—• దానికేంద్రరహస్యము •—

శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే
యే చా ప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥

శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః॥

శ్లో॥ యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యంచ కూటస్థ మచలం ధ్రువమ్॥
సన్నియ మ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితే రతాః॥

శ్లో॥ క్లేశోఽధికతర స్తేషాం అవ్యక్తాసక్తచేతసాం
అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే॥
యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే॥
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి న చిరా త్పార్థ! మయ్యావేశితచేతసామ్॥



ఇచ్చట భక్తిజ్ఞానయోగములు రెండును చెప్పబడినవి. పై వాక్యములలో రెండును వివరింపబడినవని చెప్పవచ్చును. జ్ఞానయోగము మహోన్నతము. అది ఉన్నతవేదాంతము. ప్రతిమానవుడును విచిత్రముగ వేదాంతానుసారము తూ చా తప్పకుండ నడచుకొనగలనని తలంచును. కాని నిజమునకు వేదాంతమతానుసారము జీవించుటబహుకష్టతరము. మనజీవితముల వేదాంతముననుసరించి పోనిచ్చుటలో గొప్పయాపదలలోబడుట సహజము. ఈప్రపంచములోనిజనులు రెండురకములవారని జెప్పవచ్చును. శరీరమును రక్షించుకొనుటయే సర్వస్వమనితలంచుపిశాచస్వభావు లొకరు, శరీర మాత్మవికాసమున కొకసాధనమాత్రమే యనితలంచు దైవికస్వభావులు కొందరు. పిశాచముకూడ దనకనుకూలముగ వేదములనుండి దృష్టాంతములను జూపగలదు. ఆవిధముగ జ్ఞానమార్గము దుష్టుడు చేయునది న్యాయసమ్మతమనిచూపుచు మంచివాడుచేయుదాని కుత్సాహ మొసగును. ఇదియే జ్ఞానయోగములోని గొప్పయపాయము. భక్తియోగమో స్వభావసిద్ధము, మాధుర్యము, శాంతము, లలితము. భక్తుడు జ్ఞానయోగివలె నంతటిపెరుగుల దీయడు. కావున నాతని కెక్కుడు పతనములు గలుగవు. మతావలంబియగువాడు గైకొనెడిమార్గస్వభావ మేదైనను ఆత్మయొక్కబంధములు తెగనంతవరకు దానికి స్వాతంత్ర్యము లేదు.

ఒకగోపికవిషయమున నాత్మప్రతిబంధములగు పుణ్యాపాపము లెట్లు విచ్ఛిన్నమయ్యెనో దెలిపెడిగీత మొకటి యిచటగలదు.

శ్లో॥ తచ్చింతా విపులాహ్లాదక్షీణపుణ్యాచయా తథా
తదప్రాప్తిమహాదుఃఖవిలీనాశేషపాతకా
నిరుచ్ఛ్వాసతయా ముక్తిం గతాన్యా గోపకన్యకా॥

అమితమగునీశ్వరధ్యానానందము ఆమెయొక్క సుకృతబంధనముల ద్రోసి వైచెను. ఆయనను జేరనైతి ననెడినిరంతరాత్మదుఃఖము దుష్కృతఫలమును నశింపజేసెను. పిమ్మట నామె ముక్తయయ్యెను.

భక్తియోగములోని కేంద్రరహస్య మేమన, మానవహృదయములోని వివిధములగు భావములు, వికారములు, రాగములు, వానిమటుకు సరియైనవని యెఱుంగుటయే. కాని వానిని జాగ్రత్తగ వశపరచుకొని యవి పరిపూర్ణస్థితిని బొందువరకు అత్యున్నతమార్గములో నడపుచుండవలెను. అత్యున్నతమార్గము మనల నీశ్వరుని చెంతకు గొనిపోవునదే. తదితరమార్గము లన్నియు నీచములే. మనజీవితములలో సుఖదుఃఖభావములు మిగుల సామాన్యములనియు, తరచు వచ్చుచుండుననియు నెఱుగుదుము.

ద్రవ్యముగాని తదితరఐహికవస్తువులు లేవనిగాని చింతించెడినరుఁడు దనభావమునకు చెడుదారి చూపుచున్నాఁడు. ఐనను దుఃఖమునకు గూడ గొంతయుపయోగమున్నది. అత్యున్నతమును ఈశ్వరుని బొందలేదని నరుని దుఃఖింపనిమ్ము. అట్టిదుఃఖమువలన నాతఁడు తరించును. నీచేతినిండ రూకలున్నవని సంతసించినచో నీసంతోషమార్గమునకు దప్పుత్రోవను జూపినట్లే. దాని కున్నతమార్గమును జూపవలెను. ఉన్నతాదర్శము నుపచరించునట్లు చేయవలెను. అట్టియాదర్శములలోనిసుఖము మనకు పరమానందము నొడగూర్చును. మనయితరభావముల విషయముగూడ సంతియే. భక్తుఁడు వానిలో నొక్కటియు దప్పుగాదనును. అతఁడు వానినన్నిటి జేపట్టి ఈశ్వరుని దిక్కునకు మరల్చును.

# పరాభక్తి.



౭ అధ్యాయము.

## ప్రేమ నగుపరచు చిహ్నములు.

"సమ్మాన, బహుమాన, ప్రీతి, విరహేతరవిచికిత్సా, మహిమఖ్యాతి, తదర్థప్రాణస్థాన, తదీయతా, సర్వతద్భావ, అప్రాతికూల్య, ఆదీనిచ స్మరణేభ్యో బాహుళ్యాత్ ....... శాండిల్యః.

ప్రేమ తానెట్లు ప్రత్యక్షమగునో గొన్నిచిహ్నములు (Forms) యిందు జూపబడును. మొదటిది గౌరవము (Reverence). జనులు దేవాలయములను పవిత్రక్షేత్రములను ఏలగౌరవించవలెను? ఆయన యచట బూజింపబడుచున్నాఁడు. అట్టిక్షేత్రము లన్నిటితో నాయన కాగమన సంబంధము గలదు. ప్రతిదేశములోను మతగురువుల నేల జనులు గౌరవింతురు? అట్టిగురువులందరు ఈశ్వరుని బోధింతురుగాన మానవహృదయముల కటుల జేయుట స్వభావసిద్ధము. గౌరవమునకు జన్మస్థానము ప్రేమ. మనము ప్రేమించనివారి నెన్నఁడును గౌరవించము. పిమ్మట నీశ్వరునియెడ ప్రీతి — ఇంద్రియవిషయములయెడ మనుజులెంతటి యపరిమితప్రీతిని జూపుచున్నారు ! వారు ప్రేమించినదానిని, వారియింద్రియములు కోరినవానిని పొందుటకుగాను ఎట్టియుపాయములకైనను దలయొగ్గుదురు! ఎట్టిచోటులకైన బోవుదురు! భక్తుని కత్యంతావశ్యకవిషయ మేమన, నీశ్వరునియధీనము జేయబడినయిట్టి యుత్కృష్ట

ప్రేమయే. పిమ్మట దుఃఖములలో మాధుర్యతమమైనది, ప్రియతర వస్తువు లేకుండుటచే గలుగునపరిమితదుఃఖము— విరహము— ఈశ్వరుని బొందలేదని యెఱుంగదగిన "ఏకమేవా" పదార్థము నెఱుంగలేదని మనుజుడు అపరిమితదుఃఖమును బొంది దానిమూలమున నతృప్తుడై దాదాపుగా పిచ్చివా డెపుడగునో యపుడే విరహావస్థ. మన సస్థితిలో నున్నపుడు తనప్రియతమమైన పదార్థముదప్ప తదితరములు గంటికి కనుపడినపుడు మిక్కిలి కలతనొందును. ఇదియే ఏకరతివిచికిత్సా — భౌతిక ప్రేమలో నిట్టి విరహము తరచుగ కలుగుచుండును. మరల, పురుషులు స్త్రీలను గాఢముగను యథార్థముగను ప్రేమించినపుడుగాని వారి కెదుట వారి కిష్టులుగానివా రుండినచో సహజముగ మిక్కిలివిసుగుదల (Annoyance) జనించును. మానసము పరాభక్తివశమైయున్నపుడు అయిష్టముగలవాని యెడ నసహనమే గలుగుచుండును. అపు డీశ్వరేతరవిషయములగూర్చి మాటలాడుటకైన రుచింపదు. "తమేవైకం జానథ ఆత్మానం. అన్యావాచో విముంచథ—ఆతనినే తలంపుము. ఆతనినిమాత్రమే యోజించుము. తక్కిననిరుపయోగములగువాక్యముల ద్యజింపుము." ఆయీశ్వరునిగూర్చి పలుకువారుమాత్రమే భక్తునకు మిత్రులుగ నుందురు. తదితరములగూర్చి పలుకువారు శత్రువులుగ నుందురు. ఆప్రేమాదర్శముకొరకే జీవితమును భరించుట గలిగినపుడు ప్రేమయొక్క మరొక ఉన్నతసోపానమును బొందినవార మగుదుము. అట్టిప్రేమచేతనే జీవితము ఆనందముగను యోగ్యముగను గనుపట్టును. (తదర్థప్రాణస్థాన). అట్టిది వినా ఆజీవిత మొకక్షణమైనను నిలువదు. జీవిత మాప్రియతరమును యోచించునుగనుకనే మాధుర్యము. భక్త్యనుసారము మానవుడు పరిపూర్ణుడగుటనే "తదీయతా" గలుగును. ఆతడు పావనుడైనపుడు ఈశ్వరునిజేరినపుడు, ఈశ్వరునిపాదపద్మముల స్పృశించినపుడు ఆతని



స్వభావమంతయు పవిత్రీకృతమై పూర్తిగ మార్పుజెందును. అపుడాతని జీవితము కృతార్థత గనును. ఇవనట్టిభక్తులు చాలమంది యాతని బూజించుటకుమాత్రమే జీవింతురు. వారు త్యజించనట్టి యానందము, జీవితములోనివికైకసుఖ మదియే. "ఓరాజా! ప్రతిదానితో దృప్తిబొంది, హృదయబంధనములన్నియు భిన్నములైనట్టివారుగూడ నూరక ప్రేమకొరకుమాత్రమే యీశ్వరుప్రేమించునంతటిపావనమైనది హరిగుణము." "యం సర్వే దేవాః నమస్యన్తి, ముముక్షువో బ్రహ్మవాదినశ్చేతి దేవత లందరును ముముక్షువులును, బ్రహ్మజ్ఞానులును ఏదేవునిబూజింతురో" యట్టిహరిని... నృ. తా...ఉ.

ప్రేమయొక్కశక్తి యట్టిది. మనుజు డెపుడు తనను దాను మరచి, తన కేమియు లేదనుకొనునో, అపు డాతడు తదీయతావస్థను బొందును. ప్రతిది ఆప్రియతరమునకు జెందుటచే పవిత్రము. భౌతికప్రేమవిషయమునగూడ, ప్రియుడు తనప్రేయసికిజెందిన దంతయునుగూడ తనకు పవిత్రమును, ప్రియతమముగను తలంచును. తనమనోహారిణికి జెందినవస్త్రఖండమునుగూడ ప్రేమించును. అదేవిధముగ మనుజు డీశ్వరుని ప్రేమించునపుడు విశ్వమంతయు నాతనిదేగావున నాతనికి ప్రియతరముగ నగును.

శ్లో॥ వ్యాధస్యాచరణం, ధ్రువస్యచ వయో, విద్యా గజేంద్రస్య కా
కుబ్జాయాః కిము నామరూప మధికం, కింవా సుదామ్నో ధనం
వంశః కో విదురస్య, యాదవపతే రుగ్రస్య కిం పౌరుషమ్
భక్త్యా తుష్యతి కేవలం నచ గుణై ర్భక్తిప్రియో మాధవః॥

---

# పరాభక్తి.

## ౫ అధ్యాయము.

## సమష్టిప్రేమ - ఎట్లాత్మాధీనతకు (సమర్పణకు) దారిచూపును.

ఎట్లు మనము మొదట సమష్టిని, (సర్వసామాన్యమును) ప్రేమింపకుండ వ్యష్టిని (ప్రత్యేకమును) ప్రేమింపగలము? ఈశ్వరుడు సమష్టి (సమస్తమునకు) జెందినట్టిన్ని, సంక్షేపింపబడినట్టిదిన్ని, మనము చూచునట్టి జగత్తు, వ్యక్తి, ప్రత్యేకింపబడినవస్తువు. కోటానకోట్లు చిన్నచిన్నసంయుక్తములు (unities) ఒదిగియున్నట్టి ఒకే ఐక్యమును — సమష్టిని ప్రేమించుటమూలముననే విశ్వమును సమస్తమును ప్రేమింపగలము. భారతవర్షములోని వేదాంతులు ప్రత్యేకములతో—వ్యష్టితో—నాగరు. వ్యష్టి నించుకమార్గవశమున గనుగొని, వెంటనే ప్రత్యేకములన్నియు గలిసియుండు సర్వసాధారణరూపములను గనుగొన బయలుదేరును. భారతీయవేదాంతము, మతాన్వేషణము, సమష్టిని యొక్క—దానిని గూర్చియే. జ్ఞాని వస్తువులయొక్క పరిపూర్ణతకై, సమస్తమునకు జెందునట్టిన్ని సంపూర్ణమైనట్టిన్ని జీవికై, దేని నెఱింగినచో ప్రతి వస్తువు నెఱింగినట్లేయగునో దానికై జూచును. భక్తుడో ఆయొకే సమస్తమునకు జెందునట్టిన్ని సంక్షేపము చేయబడినట్టిన్ని పురుషుని, ఎవరిని ప్రేమించిన విశ్వమునంతయు ప్రేమించినట్లగునో, ఆతని ననుభవింపగోరును. యోగి ఆయొకేసమస్తమునకు జెందుశక్తిరూపమును, దేనిని వశీకరించుటచే విశ్వమునంతయు వశీకరించుకొనునో



దానిని బొందియుండగోరును. భారతీయమానసము ఆచారితముగ ప్రతివస్తువుయొక్క—శాస్త్రములు, ఆత్మవిచారము, ప్రేమ, వేదాంతము—సమష్టియొక్క యన్వేషణమునమాత్రమే నడుపబడినది. భక్తుడు బొందుసారాంశ మేమన, ఒకమనుజుని తరువాత మరొకని నూరక ప్రేమించుచు బోవుచో నీవు ప్రపంచమును సమస్తమునొకటిగ నెన్నటికిని ప్రేమింపజాలకుండ వారిని శాశ్వతముగ బ్రేమించుచు నట్లే పోవుచుండవచ్చునని. కడకు కేంద్రీకృతభావము—ప్రేమయొక్క సర్వస్వము, విశ్వములోని సమస్తాత్మలయొక్క—స్వచ్ఛందములు, బద్ధులు, ముముక్షుత్వమునకు బెనగులాడునట్టివి గానిండు—కోరికలసర్వస్వము ఈశ్వరుడని ఎఱింగినపుడుమాత్రమే ఎవరికైనను సమష్టిప్రేమను గనుపరచుటకు శక్తిగలుగును. ఈశ్వరుడు సమష్టి; ఈగనుపడుజగత్తు భేదపర్చబడి తేటతెల్లముగ జేయబడిన ఈశ్వరుడే. ఈసర్వస్వమును (Sum total) మనము ప్రేమించుచో బ్రతిదానిని ప్రేమించినట్లే. ప్రపంచమును బ్రేమించుట, దానికి మేలొనర్చుట యప్పుడు తేలికగనే వచ్చును. మన మాశక్తిని మొదట ఈశ్వరుని బ్రేమించుటమూలముననే పొందవలెను. అట్లుగానిచో బ్రపంచమునకు మేలుచేయుటయన నొకయాటగాదు. "సమస్తము నాతనిదే, ఆతడే నాప్రియతముడు, నే నాతని బ్రేమింతును." అని భక్తుడు పలుకును. సమస్తవస్తువులును ఆతనివేగావున నీవిధముగ ప్రతిదిన్ని భక్తునకు పావనముగ నుండును. అందరాయనపిల్లలు. ఆయనశరీరము, ఆయన ప్రత్యక్షరూపము, అట్లగుచో మన మెవరికైన నెట్లు హానిచేయగలము? అప్పు డెవరినైన నెట్లు ప్రేమించకుండ నుండగలము? ఈశ్వరునియెడ బ్రేమతోపాటు ఫలితముగ విశ్వములోని ప్రతివారియెడ బ్రేమ వచ్చును. మన మీశ్వరుని సమీపించినకొలదిని సమస్తవస్తువు లాయనలో నున్నట్లు మిక్కిలిగ జూడగలము. ఆత్మ యీపరమప్రేమయొక్క యానందమును వినియో

గించుకొనగలిగినపుడు ప్రతివస్తువులో నాయనను జూడ నారంభించును. మనహృదయ మావిధముగ నెడతెగనిప్రేమప్రవాహమగును. మరియు మన మీప్రేమయొక్క ఉన్నతస్థితులను బొందినపుడు ప్రాపంచికవిషయములలో గలచిన్న చిన్న భేదములు బూర్తిగ నశించిపోవును. మానవుడిక మానవుడుగగాక ఈశ్వరుడుగ గనుపట్టును. జంతు వొకజంతువుగ గాక ఈశ్వరుడుగ గనుపట్టును. వ్యాఘ్ర మొకక్రూరజంతువుగగాక ఈశ్వరునియొక్కప్రత్యక్షస్వరూపముగ గనుపట్టును. ఈవిధముగ నీ యత్యంతమైనభక్తిభావములో పూజ ప్రతిజీవికిని, ప్రతిప్రాణికిని నొసంగబడినది.

శ్లో॥ ఏవం సర్వేషు భూతేషు భక్తి రవ్యభిచారిణీ,
కర్తవ్యా పండితైః జ్ఞాత్వా సర్వభూతమయం హరిం॥

పరమేశ్వరుడగుహరి ప్రతిదానియందును నున్నాడనియెఱింగి బుద్ధిమంతులు సర్వజీవులయెడ నిశ్చలమైనప్రేమను జూపవలయును. ఈవిధమగు నత్యంతసర్వాకర్షణీయప్రేమఫలితముగ బరిపూర్ణమగు ఆత్మసమర్పణభావము సంభవించునదంతయు మన కప్రాతికూల్య మను భావము కలుగును. అపు డీప్రేమించెడియాత్మ బాధకలిగినపుడు "బాధా! నీకు స్వాగతము" అనిపలుక శక్తుడగును. దుఃఖముగలిగినపుడు "దుఃఖమా! స్వాగతము. నీవుగూడ ప్రియతమునువద్దనుండియే గదా" యనును. సర్పము వచ్చినపుడు, "సర్పమా స్వాగత" మనును, మరణము సంభవించినపు డట్టిభక్తుడు మందహాసముతో స్వాగతమొసంగును. అవన్నియు నావద్దకువచ్చుటకు ఏమి నాభాగ్యము! వానికన్నిటికి స్వాగతము." ఈఈశ్వరునియెడలను, ఆయనకు జెందిన సమస్తమునెడలను గల యత్యంతప్రేమనుండిపుట్టిన పరిపూర్ణమైన యాత్మసమర్పణావస్థలో నాతనికి గలిగెడిసుఖదుఃఖములకు దారతమ్యము నేమాత్రము నెంచడు. బాధనుగురించిగాని, దుఃఖమును



గురించిగాని ఏవిధమైన మొరపెట్టుకొనుటగాని యెఱుంగడు. సమస్త ప్రేమమయియగు ఈశ్వరునియిచ్ఛకు దనను వదలివైచుకొనుట మహనీయమైనట్టియు సాహసవంతమైనట్టియు ప్రదర్శనము లన్నిటికన్న మిన్నయును, యోగ్యము నగుసంపాదనయగును.

ఎక్కువ మానవకోటికి శరీరమే సర్వస్వము. వారికి శరీరమే విశ్వము. శరీరానుభవమే వారికి సమస్తమునగును. ఈశరీరముయొక్కయు, శరీర పరికరములయొక్కయు, యర్చనాపిశాచము మనయందరిలోను బ్రవేశించినది. మనము మిగుల నున్నతవిషయముల మాట్లాడవచ్చును: మరియునత్యుచ్ఛముగ నెగురవచ్చును. గాని మనముగ్రద్దలవంటివారమే. మనమనస్సంతయు క్రిందనుండు శవముమీదనే నిలచియుండును. మనము పెద్దపులినుండి శరీరము నేల రక్షించుకొనవలెను? దానిని వ్యాఘ్రమునకేల సమర్పింపరాదు? దాన వ్యాఘ్రము తృప్తిపొందును. అది యాత్మత్యాగము. అర్చనకన్న మిక్కిలి భిన్నముగాదే? "అహం" అనునట్టిభావము పూర్తిగనశించినట్టి పరిస్థితులను అనుభవింపగలవా? అది ప్రేమమత శిఖరముయొక్క కనులు దిరిగెడిఉన్నతస్థానము. దాని నీప్రపంచకములో గొద్దిమందియే చేరిరి మనుజు డట్టి యత్యుచ్ఛమైన సర్వదాసిద్ధమును, సర్వదాఐచ్ఛికమునగు ఆత్మసమర్పణయోగము (స్థానమును) చేరనంతవరకు పరిపూర్ణభక్తుడు గాజాలడు. మనమందరమును మనశరీరములను కొద్దిగొప్ప తృప్తికలుగునట్లును, కొద్దిగొప్ప కాలమువరకును నిలుపుకొనసమర్థులము గావచ్చును. అట్లయినను మన శరీరములు నశించవలసినవే. వానికిశాశ్వతత్వము లేదు. పరులకు సేవజేయుటలో నశించినశరీరములుగలవారలు ధన్యులుగదా!!

తే॥ సిరియు జీవంబు పరజనసేవయందె
సిద్ధముగ నుంచుచుందురు సిద్ధమతులు

ధరణి జనులకు జావు యథార్థ మగుట
తనువు సత్కార్యములయందె జనుట లెస్స॥

మనము ఏబది లేక నూరువత్సరములు జీవింపవచ్చునుగాక, గాని పిమ్మట గలుగునదేమి ? సంయుక్తముయొక్క ఫలితమగు ప్రతిపదార్థమును విచ్ఛిన్నమై నశించవలసినదే. అది విముక్తమగుకాల మొకటి వచ్చును. రాకతప్పదు. ఏసుక్రీస్తు, బుద్ధుడు, మహమ్మదు, మరణించిరి. "ప్రపంచములోని గొప్పగొప్పప్రవక్తలు, గురువులు మరణించిరి. "ప్రతివస్తువును నశించిపోవుచున్నట్టి పరుగులువారెడి ప్రపంచమునందు, మనకుండెడి కొంచెపుకాలమునుగూడ సద్వినియోగముచేయవలెను " అని భక్తుడనును. యథార్థమున, జీవితముయొక్క ఉత్కృష్ట ప్రయోజనము సమస్త జీవుల సేవయందు వినియోగించుటయే. భరింపరాని యీశరీరభావన "నే"ననునది యీభౌతికశరీరమే యనెడి గొప్పభ్రమలోబడి కాయశక్తుల దానిని రక్షించుకొన, తృప్తిజెందించుకొన నన్నివిధముల ప్రయత్నములు సలుపుటయే యీ ప్రపంచములోని సమస్త స్వార్థమునకు కారణము. "నీవు" శరీరేతరుడ"వని బాగుగనెఱింగినచో గలహములకును, కొట్లాటలకును నవకాశమే లేదు. నీలో మమత్వభావన బొత్తుగ చచ్చియేయుండును. గావుననే భక్తుడు, మనము సమస్త ప్రాపంచికవస్తువులకు బొత్తుగజచ్చిపోతిమా యనునట్లుండవలెను. అదియే యథార్థమగు ఆత్మాధీనత ( Self surrender. ) ఏదైనను సంభవించనిండు. " నీయిచ్ఛయే నెరవేరును, " అనుదానికర్థ మిదియే. కలహములతో గాలయాపన జేయుచు, మనబుద్ధిహీనతను, భౌతిక వాంఛలను, యీశ్వరేచ్ఛానుసారముగాబోలుననుకొనుట గాదు. మన యీస్వార్థకలహములనుండిగూడ కొంతమేలుకలిగిన కలుగవచ్చునుగాక



ఎట్లయినను, నదంతయు నీశ్వరనిర్ణయము. పరిపూర్ణభక్తుని భావము స్వార్థమున కెన్నటికిని దలంచగూడదు. కృషి సలుపగూడదు.

తే॥ " దేవ ! నీచిహ్నాతంబులు దేవళములు
దానముల జేతు రెన్నియో ధనికు లుర్వి
జిల్లిగ వ్వొక్కటైన నాచేత లేదు
నాదు దేహంబె నీకర్పణంబు సేతు
కాచినను ద్రోచినను నీవె గలవు దిక్కు॥" .

ఇట్టిదే భక్తునిహృదయకుహరమునుండి వెడలుచుండు ప్రార్థన. దాని ననుభవించిన వానికీశ్వరపరముగ చేయబడిన యీస్వార్థత్యాగము, సమస్త భాగ్యభోగ్యములు, ధనాధికారముల త్యాగముకన్న మిన్నయగును. భక్తునియొక్క యీయతినిర్మలమగు సమర్పణమువలనగలిగెడి శాంత మతుల్యమును అమూల్యమునైనది. ఆతని యప్రాతికూల్యభావము, వాంఛారహితమును, సహజముగ నాటంకమున నెట్టిదో ఎఱుగనట్టిమానసికావస్థ. ఈపరిపూర్ణ సమర్పణావస్థయందు సృష్టిస్థితిలయ కారణభూతుడగు నాయీశ్వరునియం దుండెడి యచంచలమగు ప్రేమ యొక్కటి దక్క తదితర బంధనరూపములన్నియు బూర్ణముగ దెగిపోవును. ఈవిధమగు నీశ్వరప్రేమబంధము యథార్థముగ నాత్మకు బంధరూపముగ కాక, సమస్తబంధవిచ్ఛేదక సాధనముగ పరిణమించును.



# పరాభక్తి.

౧. అధ్యాయము.

## యథార్థభక్తున కున్నతప్రేమ జ్ఞానములు రెండు నొకటే.

ఉపనిషత్తులు జ్ఞానమును, ఉన్నతము, నీచమునని ద్వివిధములుగ జెప్పుచున్నవి. భక్తునికో నిజముగ నిట్టిఉన్నతజ్ఞానమునకును ఉన్నతభక్తికిని (పరాభక్తి) భేదములేదు. ముండకోపనిషత్తు యిట్లు చెప్పుచున్నది.

"ద్వే విద్యే వేదితవ్యే ఇతిహాస్మ యద్ బ్రహ్మవిదో వదంతి
పరాచై వాపరాచ. తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః
సామవేదోఽథర్వవేదః. శిక్షాకల్పో వ్యాకరణం నిరుక్తం
ఛందోజ్యోతిషమితి. అధపరాయయా తదక్షర మధిగమ్యతే॥"

బ్రహ్మజ్ఞానులు ఎఱుగదగినవిద్యలు రెండు:- పరా, అపరా—గలవని పలుకుదురు. వీనిలో యపరావిద్య ఋగ్, యజు, స్సామాఽథర్వవేదములు. శిక్షా, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషమగును. పరావిద్యయన మార్పులేనిదగు పరబ్రహ్మవస్తువును దేనిచే నెఱుంగనగునోయది. బ్రహ్మజ్ఞానమే యున్నతజ్ఞానమని యీవిధముగ స్పష్టముగ జూపబడినది. దేవీభాగవతమున పరాభక్తి యీక్రింద విధముగ నిర్వచింపబడినది.

ద్వి॥ "ఒకపాత్రనుండి వేరొకపాత్రలోని
కేగెడినూనియ మెట్లవిచ్ఛిన్న



ధారగబడు నట్లె తలగక చిత్త
మీశ్వరునందు నేకీభూత మొందు
నప్పుడెబో గల్గు నత్యుచ్ఛభక్తి॥"

ఈశ్వరునియెడ నీవిధమగు నచంచలమును, నవిచ్ఛిన్నమునగు మనో, హృదయము లభేద్యమగు సంగసహితములైయుండుటే యీశ్వరునియెడ మానవుని యథార్థమైన యుత్కృష్టభక్తికి నిదర్శనము. భక్తియొక్క తదితరరూపములన్నియు నీయుత్కృష్టరూపము, అనగా పరాభక్తి, లేక సంగము వెంటనే వచ్చు దాని (రాగానుగ) యొక్క యుపలబ్ధికి ప్రాథమిక సాధనములు. ఈపరాభక్తి మానవహృదయము నొకతూరి చొచ్చెనా యాతని చిత్తము తదేకముగ నీశ్వరునిదప్ప నితరము నేమియు దలంచదు. ఆత డీశ్వరచింతనతప్ప తదితరమున కేమాత్రమవకాశమివ్వడు. ఆతని యాత్మ యత్యంతపవిత్రముగనుండి, అదియే ప్రకృతిమనస్సులయొక్క బంధములను బగులగొట్టి నిరాటంకమగు స్వేచ్ఛతనుబొందును. ఆతడు మాత్రమే ఈశ్వరుని దనహృదయమున బూజింపగలడు. ఆతనికి రూపములు, చిహ్నములు, గ్రంథములు, సిద్ధాంతములు, సమస్తమును, నిష్ప్రయోజనమును, నిరుపయోగమునగుచున్నవి. ఈశ్వరునావిధముగ ప్రేమించుట సులభముగాదు. సాధారణముగ మానవప్రేమ ప్రతిఫలముగలుగుచోటనే యభివృద్ధిజెందునట్లు కనుపట్టును. ప్రేమకు మారుప్రేమ ఎచట లేదో వట్టియుపేక్షయే యచ్చట సాధారణఫలితము. మారుప్రేమ లేకుండ ప్రేమ తనంతదాను గనుపట్టు విషయము చాలతరుచుగనుండును. ఎట్లన, ఈవిధమగు

ప్రేమను అగ్నికై నుసిపురుగునకుగల ప్రేమతో బోల్పవచ్చును. ఆపురుగగ్నిని ప్రేమించి దానిలోబడిపోయి చచ్చును. అట్లు ప్రేమించుట యాపురుగుయొక్క స్వభావమే. ప్రేమకు ప్రేమించుటయే సహజత్వమని ప్రేమించుట ప్రపంచమున గనుపట్టు ప్రేమయొక్క త్రోయరాని స్వార్థరహితమును, ఉత్కృష్టమునగు నిదర్శనమైయున్నది. అట్టిప్రేమ యాధ్యాత్మికముగ బనిచేయునపుడు పరాభక్తియొక్క యుపలబ్ధికి దారిచూపును.



# పరాభక్తి.

౭ అధ్యాయము.

## ప్రేమ త్రికోణము.

౧ బేరరాహిత్యము.

౨ భయరాహిత్యము.

3 శత్రురాహిత్యము.

మనము ప్రేమ నొక త్రికోణముగను, దానియొక్క ప్రతికోణము నొక్కొక్క లక్షణమున కనుగుణముగ నుండునట్లును వర్ణింపవచ్చును. మూడుకోణములులేని త్రికోణ ముండజాలదుగదా. అట్లే యీక్రింది మూడులక్షణములులేనిది యథార్థప్రేమ యుండబోదు. ఈప్రేమ త్రికోణమునకు మొదటికోణము బేరరాహిత్యము. దేనినైనబదులుగ నెచటనైన కోరినచో యథార్థప్రేమ లేనట్లే. అది వట్టిచిల్లరదుకాణము పెట్టినట్లే. ఈశ్వరునియెడ మనముచూపుభక్తికిని విధేయతకును బదులుగ నాయననుండి యేదైనవరమును గోరెడిభావమైన నెంతకాలముండునో యంతకాలము మనహృదయమున యథార్థప్రేమ యభివృద్ధికాజాలదు. ఏవైనవరముల బ్రసాదించుటకై యీశ్వరునిబూజించెడివా రట్టి వరముల బొందనిచో యాతనిపూజించకుండుటే యథార్థము. ఈశ్వరుడు ప్రేమమయుడుగావున. భక్తుడు ప్రేమించును. యథార్థభక్తున కిట్టిభావము, ఉత్సాహముకలుగుట కితర కారణ మేమియు లేదు.

ఒకానొకరాజొకనాడడవిలో దిరుగుచు దాపసినొకని జూచెను. ఆతడా తాపసితో గొంతవరకుముచ్చటించి యాతని తెలివికిని పవిత్రతకును జాలగదృప్తిబొందెను. రాజంతట నాతనిని దనవద్దనుండి యేదైనబహుమతిని గైకొని యనుగ్రహింపుమని వేడెను. తాపసి యంత;

శ్లో॥ కిం కన్దాః కన్దరేభ్యః ప్రళయ ముపగతా నిర్ఝరావా గిరిభ్యః,
ప్రధ్వస్తావా తరుభ్యః సరసఫలభృతో వల్కలిన్యశ్చ శాఖాః,
వీక్ష్యంతే యన్ముఖాని ప్రసభమపగతప్రశ్రయాణాంఖలానాం
దుఃఖోపాత్తాల్పవిత్తస్మయపవనవశాన్నర్తితభ్రూలతాని॥

మ॥ ఇల గందంబులు మూలముల్ మడిసెనో, యే ల్లింకెనో కొండలన్
ఫలముల్ నారలు వృక్షశాఖలయెడన్ బాడయ్యెనో చూడఁగే
వలదుఃఖాప్తమితార్థగర్వపవనవ్యానర్తితభ్రూలసత్
ఖలభూపాస్యము లర్థిఁ జూచుటకు భ్రాంతస్వాంతులై యాచకుల్॥

‘ అడవిలోని ఫలములు మాకాహారములు. కొండవాగుల చల్లని నిర్మల జలములు పానీయములు. తరువుల చర్మము కట్టుకొనుటకు చాలిన వస్త్రము, కొండగుహలు నివాసములు. ఇట్లగుటచే నేనేల నీ వద్దనుండి గాని యితరులయొద్ద నుండిగాని బహుమతుల స్వీకరించవలె ’ నను చు దిరస్కరించెను. రాజు “ నన్ననుగ్రహింపను మాత్రమే నాయొద్దనుండి ఏదైన గ్రహించి నా పట్టణమునకు వేంచేసి నా ప్రాసాదమున నుండు ” డనెను. మిగుల బలవంతపెట్టగా కడకాతపసి రాజుపట్టణమునకు ఆతనితో బోయెను. తాపసికి బహుమతి నివ్వకపూర్వమే రాజు తనప్రార్థనాకాలమందు “ఈశ్వరా ! నాకింకను సంతానము నిమ్ము. ధన మింకను రెట్టింపుగ నిమ్ము. రాష్ట్రము నిమ్ము. నాశరీరమును మంచిస్థితిలోనుంచు” మని వేడుచుండెను. రాజు ప్రార్థన ముగియక పూర్వమే తాపసి యాగదినుండి మెల్లగ లేచి వెడలి



పోయెను. రాజది చూచి యాతనివెంటనంటుచు “అయ్యా ! నాబహుమతిని స్వీకరించకుండనే తమరు వెడలుచున్నా”రని కేకలు వేయుచుండెను. తాపసి వెనుకకుదిరిగి “భిక్షుకులను నే నెన్నడును వేడను, నీ వొకభిక్షుకుడవుగాని యధికముగావు. అటులగుటచే నీవు నా కేమివ్వగలవు ? నీయట్టి భిక్షువునుండి గైకొను నంతటి మూర్ఖుడను గాను. నావెంట రావలదు పో” మ్మని పలికెను. వట్టి భిక్షుకులకును యథార్థభక్తులకును గల భేదము బాగుగా నిరూపింప బడినది. “ బిచ్చమెత్తుకొనుట, ” భక్తుల వాఙ్మయముగాదు. ముముక్షుత్వమునకుగాని, మరొకవరమునకుగాని యీశ్వరుని వేడుటగూడ యంతటి నీచత్వమే. ప్రేమకు ప్రతిఫల మేమిగలదు ? ప్రేమ సదా ప్రేమకొరకే. భక్తుడు ప్రేమింపక యుండలేడు గావున ప్రేమించును. మన మేదైన రమణీయప్రదేశమునుజూచి ప్రేమలో బడిపోయినపుడు దానినుండి నీవుగాని నీనుండి యదిగాని ప్రతిఫలముగ దేనినిగూడ గోరరుగదా. ఐనను, ఆ పరిదర్శనము నీకానందమిడును. నీయాత్మలోని కలవరమును శాంతింపజేయును. నీకు శాంతి నిడును. సద్యఃకాలమున నిన్ను మానవస్వభావమునుండి యభివృద్ధిపరచి నిన్నొకవిధమగు భగవదానందమున నోలలాడించును. ఈ యథార్థప్రేమభావము మన ప్రేమత్రికోణముయొక్క ప్రథమకోణము. నీప్రేమకు ప్రతిఫలముగ దేనినిగూడ గోరకుము. నీవెల్లప్పుడును దాతవుగనే యుండుము. ఈశ్వరునియెడ భక్తిజూపుము. కానియాతనినుండిగూడ నేమాత్రము ప్రతిఫలమును గోరకుము.

ఈత్రికోణముయొక్క రెండవకోణము ప్రేమ భయము నెఱుంగకుండుట. భయముచే నీశ్వరు బ్రేమించువారు మానవులలో నతినీచులు; మానవత్వమున బూర్ణాభివృద్ధి లేనివారు. వారు శిక్షాభయముచే నీశ్వరు బూజింతురు. వారి కీశ్వరు డొకహస్తమున గొరడాయును, మరొకహస్తమున రాజదండమును బూనినయొక యపూర్వమానవుడుగ గను

పట్టును. వారాయనకు లోబడనిచో దండించునని భీతులగుదురు. శిశుకు వెరచి యీశ్వరుబూజించునంతటి దుస్థితి మరొకటిలేదు. అది పూజయేయైనచో నట్టిది ప్రేమార్చనలో మిగుల నపరిష్కృతమైనది. హృదయములో భయముకలిగినంత కాలమును ప్రేమకూడ నెట్లుండ గలదు? ప్రేమ సహజముగ భయమునంతను జయించును. ఒకకుక్కచే దరుమబడెడి యొకతల్లినిజూడుడు, ఆమె భయముతో జెంతనుండు నింటిలోదూరును. మరుదిన మామె తనబిడ్డతో బజారున బోవుచుండగా నాబిడ్డపై సింహమొకటి దుమికెననుకొనుడు. ఇపుడామె ఎచటనుండునో ఎఱుంగుదువా? తనబిడ్డను రక్షించుకొనుచు నాసింహపువక్త్రములోనే సుమా. ప్రేమ సమస్తభయములను జయించును. భయము సమష్టి సృష్టినుండి వ్యష్టిని ప్రత్యేకించునట్టి స్వార్థభావమునుండి కలుగుచున్న నాకెంతగ స్వార్థమును సంకుచితభావమును, నధికమగునో యంతగ నాభయము హెచ్చుచుండును. మానవుడు తాను మిక్కిలియల్పుడనని దలంచుచో దప్పక భీతుడగును. నిన్నునీవెంతగనల్పుడనని తలంపకుందువో నీవంతగ నిర్భయముగనుందువు. భయము నీలోనలుసంతగనైన నున్నంత కాలము ప్రేమ యుండజాలదు. ప్రేమయును, భయమును, మిగుల నసంగతములు. ఈశ్వరుడు తనభక్తుల కెన్నడును భయావహుడుగాడు. "నీయీశ్వరునినామము నెన్నడును వృథగా స్మరింపకుము," అను నాజ్ఞనుజూచి యథార్థభక్తుడు నవ్వును. ఈప్రేమమతమున దైవదూషణకు దావెచటగలదు? నీవెంతయెక్కువగ యీశ్వరనామమును స్మరించిన, నీవెట్లుచేసినను, నీకంతగ మంచిది. నీవాతని బ్రేమించుచున్నావుగాన స్మరింతువు. ఈప్రేమత్రికోణముయొక్క మూడవ కోణము శత్రురాహిత్యము. ఫలనన, దానిలోనే భక్తుని యుత్కృష్టాదర్శమిమిడియున్నది. మనప్రేమపదార్థము మన కుత్కృష్టాదర్శము



గానంతవరకు యథార్థప్రేమ ఎన్నటికిని రాజాలదు. అనేకవిషయములలో మానవప్రేమ తప్పుదారులలో బడియుండవచ్చును. కానిభక్తునకు మాత్రము తాను ప్రేమించినపదార్థమే తన కుత్కృష్టాదర్శముగ నుండును. ఒకనియాదర్శము మిక్కిలినీచప్రాణిలో నుండవచ్చును. మరొకనికి ఉన్నతప్రాణిలో నుండవచ్చును. ఏదెట్లులైనను, ప్రతివిషయములోను ఆదర్శముమాత్రమే యథార్థముగను మిక్కిలిగను ప్రేమించబడును. ప్రతిమనుజుని యుత్కృష్టాదర్శమీశ్వరుడే. జ్ఞానిగాని, మూర్ఖుడుగాని, పాపిగాని, పరమయోగిగాని, స్త్రీగాని, పురుషుడుగాని, విద్యావంతుడుగాని, అవిద్యావంతుడుగాని, సంస్కారిగాని, యసంస్కారిగాని, ప్రతివానియుత్కృష్టాదర్శము ఈశ్వరుడే. సౌందర్యము, ఔన్నత్యము, శక్తిమొదలగు సర్వోత్కృష్టాదర్శముల సంయోగము ప్రేమించునట్టిన్ని, ప్రేమయోగ్యమగునట్టిన్ని, ఈశ్వరుని పరిపూర్ణభావము నిచ్చును. ఈ యాదర్శము లేదోయొకరూపమున ప్రతిమనస్సునను సహజముగ నుండును. మనసమస్తచిత్తములలోను అవియంతర్భాగములగుచున్నవి.

మానవస్వభావ విజృంభణములన్నియు నట్టి యాదర్శముల మన సామాన్యజీవితములో ననుభవమునకు దెచ్చుకొనుట కగుశ్రమయే. సంఘములో మనచుట్టునుజూచుచుండెడి యనేకములగు సంచలనములన్నియు అనేకాత్మలలోనుండు ననేకాదర్శములచే వెలువడి సాకారములగుటకుగాను గల్పింపబడుచున్నవి. లోపలనుండునట్టిది బయట బడుటకు యొత్తిడిజేయును. శాశ్వతమగు నిట్టిప్రబలమైనయాదర్శము యొక్క పరిచయమే మానవసంఘములో నిరంతరము పనిచేయుచున్నట్లు కనుబడెడి ముఖ్యమగు భావనాశక్తియైయున్నది. మానవుడాంతరంగికాదర్శములు బహిరంగపరిస్థితులకు సమానమై వానితో ననుగుణ్యముగ మెలంగుటకు యత్నించుట వృథయేయని ఎఱుంగుట

నూరులకొలది జన్మములనెత్తి వేలకొలదివత్సరములు శ్రమపడినపిమ్మట నేగావచ్చును. ఆతడు దీనిని కనుగొనినపిమ్మట స్వీయాదర్శమును బాహ్యప్రపంచమున రుద్దుట కింక యత్నింపడుగాని, ఆయాదర్శము నే యుత్కృష్టప్రేమలక్ష్యముగ బూజించును. ఇట్టియాదర్శరూపకమగు పరిపూర్ణాదర్శము నీచాదర్శముల నన్నింటిని లోగొనును. కాముకుడు హెలెక్ యొక్క యందమును ఎతియోప్ నుదుట చూచు ననుసామెత నిజమని యందరు నొప్పుకొందురు. దూరమునుండి సామాన్యముగ చూచువానికిట ప్రేమ స్థానభ్రంశమును బొందినట్లు గనుపట్టునుగాని, కాముకుడుమాత్రము తనహెలెక్ ను అంతటను సమముగ జూచును. కాని ఎతియోపుగాని, మనప్రేమవిషయములు యథార్థముగ మన యాదర్శముల ననుసరించి, ఘనీభవించునట్టి కేంద్రము లగుచున్నవి. ప్రపంచము సామాన్యముగ బూజించునదేమి? అత్యంతభక్తోపాసకులయొక్క యట్టిసర్వాంగీకార యోగ్యమును, ఆదర్శరూపక పరిపూర్ణాదర్శము మాత్రము నిజముగ కాదు. స్త్రీపురుషులు సామాన్యముగ బూజించెడి యాదర్శము వానిలోనుండునదియే. ప్రతిమనుజుడును స్వీయాదర్శములను బ్రపంచములో సృష్టించి వానికి దోసిలొగ్గును. గావుననే, క్రూరులు, రక్తపానకాంక్షులునగుమానవు లీశ్వరుని రక్తపానకాంక్షుడుగ దలంచుటకు జూచెదము. ఏలనన వారు తమయుత్కృష్టాదర్శములనే ప్రేమింపగలరు. కావుననే సత్పురుషులు ఈశ్వరుని ఒక యుత్కృష్టాదర్శముగ గైకొనుట. వారి యాదర్శ మితరుల వాని నుండి చాలగ భిన్నముగనుండును.



# పరాభక్తి.



౭ అధ్యాయము.

## ప్రేమమయుడగు ఈశ్వరుడు స్వయం నిదర్శనుడు.

పరిపూర్ణ, స్వార్థ, బేర సార, భీభావరహితుడగు భక్తునియాదర్శ మేమి? అట్టిమానవుడు పరమేశ్వరునకుగూడ నిట్లు చెప్పును. "నాసర్వస్వము నీకర్పించుచున్నాను. నీవలన నాకేమియువలదు. యథార్థముగ "నాది" యనునది లేనేలేదు." మానవున కిట్టినమ్మకము గలిగినప్పుడు, ఆతని యాదర్శము భయరహితమును, ప్రేమపూరితమునగున దగుచున్నది. అట్టివాని యుత్కృష్టాదర్శమునకు వివరణములో సంకుచితత్వ మేమియు నుండదు. అది సర్వసామాన్యమగుప్రేమ. మితబంధరహితమగు ప్రేమ; ప్రేమయే, నిరాటంకమగు ప్రేమయే యగుచున్నది. ఈప్రేమమతముయొక్క యుత్కృష్టాదర్శము ఏవిధమైన చిహ్నములుగాని, గుర్తులుగాని లేకయే నిరాటంకముగ బూజింపబడి ప్రేమించబడుచున్నది. ఇదియే పరాభక్తియొక్క యుత్కృష్ట రూపము. సర్వజ్ఞాదర్శమును యాదర్శముగ బూజించుటయే. భక్తియొక్క తదితరరూపము లన్నియు దానిని జేరుటకు మజిలీలవంటివే. ఈప్రేమమతము నవలంబించుటలో గలిగెడి జయాపజయములన్నియు నాయొక్క ఆదర్శానుభవమునకు దీయు మార్గములోనే యున్నవి. విషయము తరువాత విషయము గైకొనబడును. ఆంతరంగికాదర్శము వెంటవెంటనే దానిపై

వ్యాపింపజేయబడెను. (Projected) అట్టి బాహ్య విషయము లన్నియు శాశ్వతవికాసముగల యాంతరంగికాదర్శముయొక్క ప్రతినిధు లుగనుండుట కయోగ్యములని కనుగొనబడి సహజముగ నొకదాని వెనుక నొకటి తిరస్కరించబడినవి. చివరకు భక్తుడు ఆదర్శమును బాహ్యవిషయములలో గనుగొన యత్నించుట వృథాయనియు, ఆదర్శముతో బోల్చి చూచినచో బాహ్యవిషయములన్నియు నిష్ప్రయోజనములనియు దలంపనారంభించును. మరియు గొంతకాలమునకు, ఉన్నతమును, మిక్కిలి సాధారణమును, వేరైనట్టి యాదర్శమును దనకు పూర్ణముగ సజీవమును, యథార్థమును, ప్రత్యేకమునగు దానినిగ ఎఱుంగశక్తుడగుచు. భక్తుడిట్టిస్థితిని బొందినపు డాతడికమీద, నీశ్వరుని ప్రత్యక్షముగ జూడగలమా, ఆతడు సర్వశక్తిమంతుడా, సర్వజ్ఞుడాయని యడుగనుత్సహింపడు. ఆతని కీశ్వరుడు ప్రేమమయుడు మాత్రమే. ఆతడు ప్రేమయొక్క యుత్కృష్టాదర్శ స్వరూపుడు. ఆతని కంతటితో జాలును. ఆతడు ప్రేమరూపమున ప్రత్యక్షనిదర్శనుడే. కామునికి కామితవస్తువుయొక్క ఉనికినిజూపుటకు ప్రత్యక్ష నిదర్శనము లనగత్యములు. ఇతరములగుమతములయొక్క న్యాయాధీశ్వరుల యునికికి ప్రత్యక్షనిదర్శనములెన్నియో యగత్యములు గావచ్చును. గాని భక్తుడు మాత్రము అట్టి యీశ్వరులను గురించి బొత్తుగదలంపడు, తలంపజాలడుగూడ. ఆతని కీశ్వరుడు పరిపూర్ణ ప్రేమసముద్రుడు గూడ;

"న వా అరే ! పత్యుః కామాయ పతిః ప్రియో భవతి
ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి ॥
"న వా అరే ! జాయాయై కామాయ జాయా ప్రియో భవతి
ఆత్మనస్తు కామాయ జాయా ప్రియో భవతి ॥



మానవులుచేయుపనులన్నిటికిని స్వార్థమే భావనాశక్తియని కొందరు పలుకుదురు. అదిగూడ ప్రత్యేకించుటచే నీచావస్థనుబొందినట్టిప్రేమయే. నన్ను నేను సర్వవ్యాపునిగదలంచుకొన్నపుడు నాలో స్వార్థత యుండుట కవకాశమే లేదు. నేను, భ్రమచే, ఏదోయొకవ్యక్తి నను కొన్నపుడు నాప్రేమ వేరై సంకుచితపడును. ప్రేమావకాశమును సంకుచితమును, సంగ్రహముగాజేయుటయే తప్పు. సృష్టిలోని సమస్తవస్తుజాలమును యీశ్వరుని యందే పుట్టువునొందును గనుక ప్రేమపాత్రములు. సమష్టియొక్క ప్రేమలో వ్యష్టిభాగముల ప్రేమగూడ నిమిడియున్నదని మనచిత్తములో నుంచుకొనవలెను. ఈసమష్టియే భక్తులయొక్క ఈశ్వరుడు. తదితరదేవతలందరు స్వర్గములోని పితలు, పాలకులు, సృష్టికర్తలు. సిద్ధాంతములు, వాదములు, గ్రంథములు వారికి నిష్ప్రయోజనములును, అర్థరహితములును; ఏలనన, వారిపరాభక్తి ద్వారా నట్టివిషయముల కన్నిటి కతీతులైనారు. హృదయ మెన్నడు ప్రేమామృత ప్రవాహముచే పవిత్రమై, నిర్మలమై, పూర్ణమగునో, అప్పుడీశ్వరుని తదితరభావములన్నియు స్వల్పములును, అయోగ్యములునని తిరస్కరించబడును. అట్టిదే యథార్థముగ పరాభక్తి. పరిపూర్ణుడగు భక్తుడిక ఈశ్వరునిజూడ దేవాలయమునకును, ప్రార్థనామందిరములకును బోడు. ఆతనికీశ్వరునిజూడకుండెడి ప్రదేశమే లేదు. ఆతనికి దేవాలయములో నెట్లో బయటగూడనట్లే గనుపట్టును. ఆతనికీశ్వరుడు యోగియొక్క యోగమునందును, క్రూరుని క్రూరత్వమందును, గూడ గాన్పించును. ఏలనన, ఆతనిహృదయములో నత్యంత దేదీప్యమానుడుగను, సర్వశక్తిమంతుడుగను, శాశ్వతముగ ప్రకాశించుచు జిరస్థాయిగనుండెడి ప్రేమజ్యోతిగను ఇదివరకే యాసీనుడైయున్నాడు.

# పరాభక్తి.

౯ అధ్యాయము.

## దైవిక ప్రేమాదర్శముయొక్క మానవచిహ్నములు.

శ్లో॥ శ్రవణం, కీర్తనం, విష్ణోః స్మరణం, పాదసేవనం,
అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, చాత్మనివేదనమ్ ॥

మ॥ "తనుహృద్భాషలసఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్ వందనా
ర్చనము ల్సేవయు నాత్మలో నెయికయున్ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిదిభక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడైయుండుట భద్రమంచుఁదలఁతున్ సత్యంబు దైత్యోత్తమా."

ఈయుత్కృష్టమును, నిరాటంకమునగు ప్రేమాదర్శముయొక్క స్వభావమును మానవభాషలో నిర్వచించుట యావశ్యకము. మానవుని యుత్కృష్ట భావనాశక్తిగూడ దాని యనంతపరిపూర్ణసౌందర్యమును గ్రహింపజాలకున్నది. ఐనప్పటికి ఉచ్చనీచావస్థలుగల ప్రేమమతావలంబులు సర్వత్ర స్వీయప్రేమాదర్శమును నిర్వచించుటకును, గ్రహించుటకును, యీస్వల్పమానవభాష నుపయోగించుచున్నారు. ఇంతియెగాదు. మానవప్రేమయే దానివివిధరూపములలో నీయనిర్వచనీయమగు దైవికప్రేమ కుదాహరణముగ జేయబడినది. మనుజుడు దైవికవిషయములనుగూర్చి స్వీయమార్గములలోనే యోచింపగలఁడు,



మనకీపరిపూర్ణవస్తువు మనసాన్వయభాషలోనే నిర్వచింప బడగలదు. ఈసమస్త చరాచరసృష్టియును మనకు పరిమితభాషలో వ్రాయబడిన యనంతమైయున్నది. కావున, భక్తులు ఈశ్వరునకును యాతని ప్రేమార్చనకును సంబంధించిన సామాన్యమైన మానవప్రేమతోగూడియున్న సామాన్యపదముల నన్నింటి నుపయోగింతురు. పరాభక్తిని వ్యాఖ్యానించిన గొప్పవారిలో గొందఱీదైవికప్రేమను వివిధమార్గములలో గ్రహించుటకును, ననుభవించుటకును, యత్నించిరి. ఈప్రేమ గ్రహింపబడిన నీచావస్థయే శాంతభావమందురు. మనుజుడు తనయందు ప్రేమాగ్ని లేకుండ, అదేపిచ్చిలో నాతని చిత్తము మునుఁగకుండ నెన్నడీశ్వరుని బూజించునో, ఆతనిప్రేమ కేవలము రూపములు, చిహ్నములు కర్మలతోడనేయుండక యించుక యతీతముగనుండునో, అత్యంతమును తీవ్రమునగు వెఱ్ఱిప్రేమలో జిక్కుకొనకయుండునో, యదియే శాంతావస్థయందురు. ప్రపంచములోని జనులుకొందరు నెమ్మదిగ బోగోరువారును, మరికొందరు సుడిగాలివలె తీవ్రముగ బోయివచ్చువారుగ నుండగోరుటను జూచుచున్నాము. శాంతభక్తుడు నిర్మలుడు, శాంతుడు, నమ్రుడు.

తరువాత యున్నత చిహ్నము దాస్యము:– మనుజుడీశ్వరునియొక్క దాసుడనని తలంచినపు డాస్థితివచ్చును. యజమానునియెడ కృతజ్ఞుడగు సేవకునికుండు సంబంధమే యాతనియాదర్శము.

పిమ్మటిది వాత్సల్యము:— అనగా ఈశ్వరుని దండ్రినలెగాక బిడ్డనువలె బ్రేమించుట. ఇదివింతగదోచవచ్చును. గాని, ఈశ్వరుడొక యధికారియనుభావము మనకుదొలగిపోవుట కిదియొకశిక్షావిధానము. అధికారభావము వెరపుగొలుపును. ప్రేమలో వెరపెన్నడు నుండగూడదు. మనస్వభావనిర్మాణమునకు వినయవిధేయతాభావము లావశ్యకములు,

కాని స్వభావమేర్పడినపుడు, భక్తుడునిర్మలమును, శాంతమునగు ప్రేమను దానియొక్క అత్యంతమగు వెఱ్ఱిని రుచిచూచినపుడుమాత్ర మిక నేమాత్రము శిక్షావిధానమునుగూర్చిగాని, నీతిశాస్త్రమునుగూర్చిగాని, పలుక నవసరము లేదు. ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు, గంభీరుడు, కీర్తిమంతుడు, సృష్టిపరిపాలకుడు, దేవాదిదేవుడుగ భావించ భక్తుడు లక్ష్యపెట్టడు. ఈశ్వరుని యెడ భయకారణమగు నీయధికారభావసంబంధము బోద్రోలుకొనుటకే భక్తుడు ఆతని స్వపుత్రునిగ భావించుట. జననీజనకులెన్నడును పుత్రునిజూచి భయపడరు. వారికి పుత్రునిజూచినవినయముగూడ నుండదు. పుత్రునినుండి దేనినిగూడ గోరరు. పుత్రునిస్థితి సదాగ్రహీతగానేయుండును. పుత్రునిపైగలప్రేమనే తల్లిదండ్రులు తమశరీరములు నూరులకొలది పర్యాయములు ధారవోతురు. ఆపుత్రునికొరకు వారు వేలకొలది జీవితముల ధారవోతురు. కావుననే ఈశ్వరుడు పుత్రుడుగ ప్రేమింపబడుచున్నాడు. ఈశ్వరునియెడ నీపుత్రభావన ఈశ్వరుని యవతారములందు నమ్మకముగల మతసంఘములందే జనించి సహజముగ నభివృద్ధిజెందుచున్నది. మహమ్మదీయుల కిట్టిపుత్రభావనయుండుటశక్యము. వారికి దీనినివిన్నచో నెరపుజనించును. క్రైస్తవులును, భారతీయులును, దీనినిసులువుగ గ్రహించగలరు. ఏలనన, వారికి బాలయేసును, బాలకృష్ణుడును గలరు. భారతనారీమణులు తరుచుగ తమరిని కృష్ణమాతనుగ భావించుకుందురు. క్రైస్తవస్త్రీలుగూడ క్రీస్తుమాతనుగ దమరిని భావించుకొనవచ్చును. అట్లుచేసినచో బాశ్చాత్యుల కావశ్యకమగు ఈశ్వరమాతృభావనజ్ఞాన మలవడును. ఈశ్వరునియెడ భయభక్తిభావముల మూఢత్వము మనకోశములలో జీర్ణించిపోయినది. ఈశ్వరుని యెడ మనవినయ, పూజ్య, భయ, గౌరవ, కీర్తిభావములను ప్రేమలో బూర్తిగ నిమగ్నముగ జేయుట కింకను జాలవత్సరములు పట్టును.



పిమ్మటి ప్రేమచిహ్నము సఖ్యము, మైత్రి,—

"నా ప్రియమిత్రుడ నీవెగావె" మనుజుడెట్లు తనహృదయమర్మములను తనమిత్రునకు విప్పిచెప్పి తననేరముల కాతడు చీవాట్లుపెట్టక సదా తనకు సాయము జేయయత్నించునని ఎఱుంగునో, అట్లే, సమానప్రేమగూడ భక్తునకును భక్తపరతంత్రుడగు ఈశ్వరునిమధ్యనుగూడ ప్రవహించుచుండును. అట్టీశ్వరుడు మనకు మిత్రుడు, చేరువస్నేహితుడు, మనజీవితకథనముల నన్నిటిని స్వేచ్ఛగ జెప్పుకొనదగినసఖుడగును. మనహృదయకుహరాంతరాళములలో నుండురహస్యముల నన్నిటిని ఆయనకు జెప్పుకొనినచో నతిభద్రముగను సహాయకారకములుగ నుండును. భక్తుడు తనకు సమానునిగ నంగీకరించునట్టిమిత్రుడు. ఈశ్వరుడిట నొకనేస్తగాడుగ భావించబడినాడు. ఈసృష్టిలో మనమందర మాడుకొనుచున్నామని చెప్పవచ్చును. బాలురెట్లాడుకొనుచుందురో కీర్తిశాలులగు రాజులును, చక్రవర్తులును, తమయాటల నెట్లాడుకొనుచుందురో, అట్లే ప్రియుడగు నీశ్వరుడుగూడ నీప్రపంచముతోగూడ నాడుచున్నాడు. ఆతడు పరిపూర్ణుడు. వాంఛారహితుడు. ఆతడేలసృష్టించవలె? మన కేదియో కోరిక లేకున్నచో మన మిట్లే చురుకుగ పనిచేయము. ఆకోరికయే మన యసంపూర్ణతను జెప్పకయే చెప్పుచున్నది. ఈశ్వరుడు పరిపూర్ణుడు. ఆతనికి గోరికలు లేవు. ఈశాశ్వతశ్రమ పూర్ణమగు సృష్టికర్మలో నాతడేలతగుల్కొని యుండుట? ఆతనికోరిక ఏమైయుండును? ఈశ్వరుడీప్రపంచమును ఏదియో పనిగలిగియే సృజించుచున్నాడని మనభావములవెంబడి చెప్పుకొనుకథలన్నియు కథామాత్రములేగాని మరేమియుగావు. అదంతయు నిజముగ నాటయే. సృష్టి యాడబడుచున్నయాతనినాట్యమే. సమస్తసృష్టియు గడ కాతని కొకగొప్పపరిహాసముగ నున్నది. నీవు బీద

వైనచో నాబీదతనమునుగూడ పరిహాసమాత్రముగనే యనుభవించుము. అపాయములుగలిగినచో నదిగూడ పరిహాసమే. ధనికుడవైనచో ధనాఢ్యతనుగూడ బరిహాసముగనే యనుభవించుము. సౌఖ్యమొదవినచో మరింతపరిహాసము. జగమంతయు నొకరంగస్థలము. మనమందర మూరక పరిహాసముకొర కాడుచున్నాము. ఈశ్వరుడు మనతోడను, మన మీశ్వరునితోడను, నింతవర కాడుకొనుచున్నాము. ఈశ్వరుడు మనకు శాశ్వతమగు నేస్తగాడు! ఆత డెంతయానందముగ నాడుచున్నాడు!! ఆట పూర్తియైనతోడనే యుగాంతమగును. కొద్దిగనో, గొప్పగనో విశ్రాంతియుండును. మరల నదేయాట. ఇదంతయు నొకయాటయని, యీయాటలో నీవుగూడ నొకసహకారివిగ నున్నావని యెప్పుడు మరచెదవో, అప్పుడే కష్టములును, దుఃఖములును గలుగును. అంత హృదయము విచారపూరితమగును. ప్రపంచమున మనజీవిత మెంతయో భారముగ దోచును. కాని మనము యథార్థమని భ్రాంతిచే దేనిని దలంచుచున్నామో, యదంతయు క్షణక్షణమును మారుచుండునట్టియు, నశాశ్వతమగు జీవితముయొక్క స్వభావమనియు, మనమాడుచున్నట్టి రంగస్థలమనియు, ఆజగన్నాటకసూత్రధారికి సహాయభూతుల మగుచున్నామనియు నెఱింగినవెంటనే నీదుఃఖము సమసిపోవును. ఆతడు ప్రీతియమువున నాడుచున్నాడు. పృథివిని సూర్యుని, చంద్రుని నిర్మించునపుడును ఆడుచున్నాడు. మానవహృదయముతోడను, జంతువులతోడను, మొక్కలతోడనుగూడ నాడుచున్నాడు. మన మాతనిపాచికలము. ఆతడు పాచికల బల్లపైనుంచి కదలించును. ఆతడు మొదట నొకరీతిని ఏర్పరచును, పిమ్మట మరొకరీతి నుంచును. మన మెఱిగియో, ఎఱుంగకయో, యాతనికి సహకారుల మగుచున్నాము. ఆహా యానందము! మన మాతనినేస్తగాండ్రము!!



ప్రేమాదర్శముయొక్క దైవికచిహ్నము మరొకటిగలదు. అది మధురభావము, అట్టిచిహ్నములలో నెల్ల నుత్తమమైనది, ఉన్నతమైనది. అది యీప్రపంచములోని ప్రేమయొక్క ఉన్నతదర్శనముపై నాధారపడియున్నది. ఈప్రేమయే మానవు డెఱింగినంతలో బలవత్తరమైనది. స్త్రీపురుషులనడుమ నుండునదిగాక ఏప్రేమ మానవస్వభావమునంతయు జలింపజేయును. ఆతనిశరీరములో ప్రతియణువునను ప్రవహించును. పిచ్చివానిని జేసివేయును, తనస్వభావమునే మరచునట్లొనర్చును, పూర్తిగ మార్చివేయును. దేవతగనో దానవునిగనో మార్చివేయును. ఈదైవికప్రేమనిరూపణలో ఈశ్వరుడు మనకు భర్త. మనమందరము స్త్రీలము. ఈప్రపంచములో బురుషులే లేరు. ఒకేపురుషుడుమాత్రము గలడు. ఆత డీశ్వరుడు. మనప్రియుడు. పురుషుడు స్త్రీకిగాని స్త్రీ పురుషునకుగాని యిచ్చునట్టిప్రేమ యంతయును ఈశ్వరపరము జేయవలెను. మన మీప్రపంచమున జూచునట్టివెన్ని, మన మించుమించుగ నాడుకొనుచున్నట్టివెన్ని వివిధములగుప్రేమలు ఈశ్వరునే గమ్యస్థానముగ గలిగియున్నవి. దురదృష్టవశమునమాత్రమే యీప్రేమవాహిని నిరంతరమును బ్రవహించిపడుచున్నట్టియపారమగుజలరాశిని ఎఱుగదు; గావున నవివేకవశమున నాతడు దానిని, యీతుచ్ఛమును సజీవములు నగుమట్టిబొమ్మలలో నుంచ దరచుగ యత్నించుచున్నాడు. మానవస్వభావమున బాలునియందుండెడి గాఢమగుప్రేమ యాబాలుని మృణ్మయదేహమునందు గాదు. అంధుడవై పూర్తిగ నీబాలునియందే దాని నుంచినచో దానివలన నీవు చాలగ దుఃఖింతువు. కాని యట్టి దుఃఖముమూలముననే నీలోనుండుప్రేమను ఏమానవునియందైన నుంచినచో ఎప్పుడో ఒకపుడు దానికి ప్రతిఫలముగ దుఃఖము సమకూర్చునని ప్రబోధము నీకు కలుగును. కావున మన ప్రేమ నుత్కృష్టస్వరూపునకు, జననమరణరహితునకు తరంగసంచలనరహితమగు ఆనంద

సాగరున కివ్వవలెను. ప్రేమ సరియగుగమ్యస్థానమునకు జేరవలెను. యథార్థమగు నపారప్రేమసాగరుడగువానిని జెందవలెను. నదులన్నియు సాగరమును జేరును. పర్వతకందరములనుండి దిగెడినీటిబిందువుగూడ పెద్దనదినిగాని, చిన్న సెలయేటినిగాని పొందినను నంతట నాగదు. కడ కాబిందువుగూడ నెట్లో సాగరమును జేరును. మనమనోవికారము లన్నిటి కేకమగుగమ్యస్థాన మీశ్వరుడే. నీవాగ్రహపడదలచినచో నాతనిపైనే గోపగించుము. నీప్రియునే నీస్నేహితునే చీవాట్లుపెట్టుము. మరెవ్వరి నింతచనువుగ చీవాట్లుపెట్టగలవు? మానవు డెప్పుడు నీ కోపము సహించడు. ఎదురు తిరుగును. నీవు నాపై కోపపడినచో నేను దప్పక ప్రతీకారమొనర్తును. ఏలనన నీకోపమును నేను సహించజాలను. నీప్రియునితో,

"ఏల నాచెంతకు రావురా! ఓనాప్రియా!
నీ, వేల న న్నేకాకినిగా జేతురా!!" యనియనుము.

ఆతనిలో దప్ప మరెచట నీకు సౌఖ్యముకలదు? ఈచిన్నచిన్న మట్టిగడ్డలలో సౌఖ్య మేమిగలదు? మనము వెదకవలసిన దపరిమితానందముయొక్క ఘనీభవించినసారము. అది ఈశ్వరునిలో నున్నది. మనమనోవికారము లన్నింటి నాతనిపై పురిగొల్పుదము. అవన్నియు నాతనికొరకే. ఏలనన, అవి వానినియమమునుదప్పి క్రిందబడినచో దుర్బలమగుచున్నవి. అవి వానినియమితస్థలమున కనగా నీశ్వరునియొద్దకు బోవుచో వానిలో నతినీచమైనదైనను ఉత్కృష్టముగ మారుచున్నది. మానవశరీరమునకును, మనస్సునకుగలశక్తులన్నియు తమనుదా మెంతగ దెలుపుకొనుచున్నను, ఈశ్వరునే గమ్యస్థానముగ ఏకాయనముగ గలిగియున్నవి. మానవహృదయముయొక్క ప్రేమయును, వికారములన్నియు నీశ్వరుని చెంతకే పోవలయును. ఆతడే ప్రియుడు. ఈహృదయ మాతనిదప్ప



మరెవరిని ప్రేమించును? ఆతడే సుందరులలో సుందరుడు, గంభీరుడు. సౌందర్యమే యాతడు గంభీరతయే యాతడు. ప్రపంచమున నాతనికన్న సుందరు డెవడు? ఈసృష్టిలో భర్తగనుండుట కాతనికన్న దగినవా డెవడు? ఈసృష్టిలో నాతనికన్న ప్రేమపాత్రు డెవడు? కావుననే యాతనినే భర్తగను ప్రియతమునిగ నుండనిమ్ము. దైవికప్రేమను గూర్చి గానముచేయుభక్తులు మానవప్రేమవాఙ్మయ మన్నిపరిస్థితులలోను దానిని వర్ణించుటకు జాలునని యొప్పుకొనుట తరచుగ సంభవించుచున్నది. మూర్ఖులు దీనిని దెలిసికొనజాలరు. వారెన్నడును దెలుసుకొనరు. వారు దానిని చర్మచక్షువులతో మాత్రమే జూచెదరు. ఈయాధ్యాత్మిక వేదనలను వా రెఱుగరు. ఎట్లు తెలుసుకొనెదరు?

శ్లో॥ సురతవర్ధనం, శోకనాశనం,
స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్,
ఇతరరాగవిస్మారణం నృణాం,
వితరవీర న స్తేఽధరామృతమ్ ॥

ఆ॥ సురతవర్ధనంబు శోకాపహరణంబు, స్వరితవంశనాళసంగతంబు,
నన్యరాగజయము నైన నీమధురాధరామృతమున దాప మార్పు మీశ!

భక్తుని వెఱ్ఱివానిగ నొనర్చునదిన్ని, నరుని ఈశ్వరునిగ నొనర్చునదగు ప్రియునియొక్క యాయధరచుంబనమునకై దపింపుము. అట్టిచుంబన ప్రసాదమును బొందిన మనుజున కీప్రకృతియంతయు మారిపోవును. ప్రపంచము లదృశ్యమగును. సూర్యచంద్రులు గతింతురు. సృష్టియే యపరిమితప్రేమవారిధిలో గరగిపోవును. అదియే ప్రేమవెఱ్ఱియొక్క పరిపూర్ణత. యథార్థమగు నాధ్యాత్మికభక్తు డింతతో నూరకుండడు. భార్యాభర్తలనడుమనుండు ప్రేమగూడ నంతవెఱ్ఱిగ దోపదు. భక్తులు మిగుల బలీయమైనదిగావున జారత్వభావమునుగూడ గైకొందురు. ఇది యసభ్యమని వారు తలంపనుగూడ దలంపరు. దాని స్వేచ్ఛాప్రవర్తన

కాటంకము లెంతహెచ్చుగ గలుగుచుండునో యంతగ తీవ్రతను బొందుట యాప్రేమస్వభావము. సతీపతులయందుండుప్రేమ శాంతమైనది. ఆటంకము లేమియు లేవు. కావుననే భక్తులు స్వప్రియుని యందు మోహముగల యువతిభావమును, ఆప్రేమ కాటంకపరచెడి తల్లిదండ్రులను గైకొందురు. ఆమెప్రేమ కెవ్వరైన నెంతగ విఘ్నములు కలుగజేతురో యంతమిక్కిలిగ నామె ప్రేమ యభివృద్ధిపొందును. బృందారణ్యమున గోపికలు శ్రీకృష్ణు నెంతగ బ్రేమించిరో, యాతని వేణునాదమును విని వారు సర్వమును, యీప్రపంచమును దానిబంధములను, దానివిధులను, సుఖదుఃఖములను, మరచి యెట్లాతని చెంత కేగిరో మానవభాష వర్ణింపజాలదు. కావున శుకవాగమృతమును ఇంచుక గ్రోలి తరింతము.

కృష్ణవాక్యము, —

చ॥ ఇలు వడిసున్న సేసి హృదయేశుల సిగ్గులువుచ్చి యత్తమా
మల నెరియించి సోదరులమానము సూరలువుచ్చి తల్లిదం
డ్రులరుచి మాన్చి బంధులకు రోఁతయొనర్చుచు జారవాంఛలన్
వలనతి సత్కులాంగనలు వత్తురె లోకులు సూచి మెత్తురే.

చ॥ వనితలు నన్నుఁగోరి యిటువచ్చితి రింతఁగొఱంతలేదు మే
లొనరె సమస్తజంతువులు నోలిఁబ్రియంబులుగావె నాకునై
నను నిలువంగఁబోలదు సనాతనధర్మము లాఁడువారికిం
బెనిమిటులన్ భజించుటలు పెద్దలు సెప్పుచునుందు రెల్లెడన్.

క॥ ధ్యానాకర్ణనదర్శన గానంబుల నాతలంపుగలిగినఁ జాలుం
బూనెదరు కృతార్థత్వము, మానవతుల్ చనుఁడు మరలి మందిరములకున్.

శుకవాక్యము, —

శ్లో॥ ఇతివిప్రియ మాకర్ణ్య గోప్యో గోవిందభాషితమ్
విషణ్ణా భగ్నసంకల్పా శ్చిన్తా మాపు ర్దురత్యయామ్॥



శ్లో॥ కృత్వా ముఖా న్యవశుచః శ్వసనేన శుష్య
ద్బింబాధరాణి చరణేన భువం లిఖన్త్యః
అస్రై రుపాత్తమషిభిః కుచకుంకుమాని
తస్థు ర్మృజన్త్య ఉరుదుఃఖభరాః స్మ తూష్ణీమ్.

శ్లో॥ ప్రేష్ఠం ప్రియేతరవవ ప్రతిభాషమాణాం
కృష్ణం తదర్థవినివర్తితసర్వకామాః
నేత్రే విమృజ్య రుదితోపహతే స్మ కించిత్
సంరంభగద్గదగిరోఽబ్రువతానురక్తాః.

గోపికలవాక్యములు, —

మ॥ అకటా నమ్మితిమేము కూరిరుఁడవని న్నర్హంబె మాయిండ్లలో
సకలవ్యాప్తులడించి నీపదసరోజాతంబు లర్చింపఁగా
గ్రకయే తెంచితి మీకుఁడాఢ్యుఁడవు మోక్షాసక్తులం గాచు పో
లికఁ గావందగుఁ గావవే విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్॥

మ॥ పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించు టే ధర్మప
ద్ధతి యానంటివి దేహధారిణులకున్ ధర్మజ్ఞ చింతింపుమా,
పతిపుత్రాదికనామమూర్తివగుచున్ భాసిల్లునీయందుఁ ద
త్పతిపుత్రాదికవాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే॥

సీ॥ నీపాదకమలంబు నెమ్మిడగ్గఱఁగాని తరలిపోవంగఁ బాదములు రావు
నీకరాబ్జంబులు నెజీనంటితివగాని తక్కినపనికి హస్తములు సారవు
నీవాగమృతధార నిండగ్రోలఁగఁగాని చెవు లన్యభాషలు సేరివినవు
నీసుందరాకృతి నియతిఁజూడఁగఁగాని చూడ వన్యంబులఁ జూడ్కికవలు

ఆ॥ నిన్ను కాని పలుక నేరవు మాజిహ్వ। లొల్లననుచు బలుకనోడ వీవు
మామనంబులెల్ల మరపించి దొంగిలి। తేమిసేయువార మింకఁగృష్ణ!

చ॥ సిరికి నుదారచిహ్నములు సేయుభవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర మాతపముసంపదఁజేరితి మెట్టకేలకున్
మరలఁగలేము మాపగలమాటల నొల్లము పద్మగంధముల్
మరఁగినతేటు లన్యకుసుమంబులచెంతకుఁ జేర నేర్చునే॥

ఆ॥ సవతులేక నీవిశాలవక్షస్థలిఁ, దొలసితోడఁగూడఁ దోయజాక్షు
మనుపుచుము నెప్పుడు మాకాంత నీపాదకమలరజముఁగోరఁగాదె కృష్ణ !॥

మ॥ భవదాలోకన హాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్,
భవదీయాధరపల్లవామృతముచేఁ బాపందగుం బాపవే,
నివిరో గానలహేతిసంహతులచే నీఱై భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీపాదంబులానం బ్రియా ॥

క॥ తనుమృగఖగగోగణములు, కరమొప్పెడు నిన్నుఁగన్న గానమువిన్నన్
గరగెఁ, బులకించునబలలు, గరఁగరె నినుగన్న నీదుగానము విన్నన్ ॥

క॥ అమరులఁగాచినహరిక్రియ గమలేక్షణ నీవు నేఁడు కరుణ, నభయహ
స్తము మాయురముల, శిరముల బ్రమదంబున నిడుము మూర్ఛపాల్పడకుండన్.

క॥ కట్టా ! తలమునుకలునై దట్టపువిరహాబ్ధి తెరలు తరుణుల నేఁచన్,
నెట్టన్ దరిజేర్పవదో, కట్టిఁడివిగదా కుమార! కరుణోదారా ॥ (భాగవతము)

శుకవాక్యం, —

శ్లో॥ ఇతి విక్లవితం తాసాం శ్రుత్వా యోగేశ్వరేశ్వరః,
ప్రహస్య సదయం గోపీ రాత్మారామోఽ ప్యరీరమత్.

మనుజుఁడా! ఓమా-న-వు-డా !! నీవు దైవికప్రేమనుగూర్చి పలికెదవు. అదేకాలమున నీప్రాపంచికవిషయములలో దిరుగుచున్నావు. నీవు నిష్కపటివేనా ?

"జహాఁ రాం ఉహాఁ కాం నహీఁ , జహాఁ కాం, నహీఁ రామ్ ॥ "

క॥ రాము డెటనుండు నచ్చట కామమునకు దావులేదు — కామం బెట, నా
రామునకు దావులే దట తామససత్వముల కెందు దలఁగూడునో! ॥



# పరాభక్తి.

౧౦ అధ్యాయము.

## సమాప్తి.

ఈయుత్కృష్టప్రేమాదర్శము లబ్ధమైనపుడు వేదాంతము త్రోసివేయబడుచున్నది. అదెవరికిగావలెను? స్వేచ్ఛ, విముక్తి, నిర్వాణము, యివన్నియు, ద్రోసివేయబడుచున్నవి. దైవికప్రేమ ననుభవించెడివారెవరు స్వేచ్ఛ బొందగోరెదరు?

శ్లో॥ నాస్థాధర్మే, న వసునిచయె నైవ కామోపభోగే
యద్య ద్భవ్యం భవతు భగవన్! పూర్వకర్మానురూపం,
ఏత త్ప్రార్థ్యం మమ బహుమతో జన్మజన్మాంతరేపి,
త్వత్పాదాంభోరుహాయుగగతా నిశ్చలా భక్తి రస్తు॥

"ఈశ్వరా! నాకుధనమువలదు, మిత్రులువలదు, సౌందర్యమువలదు. విద్యగాని, స్వేచ్ఛగాని వలదు, నన్ను మరలమరల బుట్టనిమ్ము. నీవే సదానాప్రేమాస్పదుడవుగమ్ము. నీవే శాశ్వతముగ నాకామితమవుగమ్ము."

"ఎవడు పంచదార దాను గాఁగోరును. పంచదార రుచిచూడగోరును గాని" యని భక్తుడనును. ఎవ డపుడు స్వేచ్ఛనును, ఈశ్వరునితో
...మ? "నేనే యా... యెఱింగిన నెఱుంగుదునుగాక
...ండి విడివడి ప్రియునియనుభవిం...

నగుదును." ఇదియే భక్తుడు చెప్పునది. ప్రేమకొరకు మాత్రము ప్రేమించుట యనునదే ఆతనియత్యంతభోగము. ప్రియానుభవమునకు గాను కాళ్ళుసేతులు వేయిమారులైన నెవడు కట్టించి వైచుకొనడు? భక్తుడు ప్రేమతప్ప, ప్రేమించుట, ప్రేమింపబడుటతప్ప, మరిదేనిని వల్లడు. ఆతని యాముష్మికప్రేమ ప్రవాహములో నెదురీదుతరంగము వంటిది. ఈభక్తుడు నదిలో తరంగముల కెదురునడచును. ప్రపంచ మాతనిని పిచ్చివాడనును. ప్రపంచము పిచ్చివాడని పిలచిన వానినొకని నేనెఱుంగుదును. ఆతనిజవాబిది.

"మిత్రులారా! ప్రపంచమంతయు నొకపిచ్చివారి యాశ్రయశాల. కొందరైహికప్రేమకును, కొందరు స్వర్గగమనమునకును, కొందరు విముక్తికిని, పిచ్చివారగుచున్నారు. ఈపెద్దపిచ్చివారి యాశ్రయస్థానములో నేనుగూడ నీశ్వరునకై పిచ్చివాడనగుచున్నాను. మీరుధనమునకు పిచ్చివారలైనచో నే నీశ్వరునికొరకగుచున్నాను. మీరు పిచ్చివారు. నేనుగూడ నంతియే. కడకు నాపిచ్చియే శ్రేష్ఠమనుకొనెదను."

యథార్థభక్తుని ప్రేమ యీప్రజ్వలించుచుండెడి పిచ్చియే. దానిముందాతనికి సమస్తము నదృశ్యమగును. సృష్టియంతయు నాతనికి ప్రేమపూరితముగ గాన్పించును. భక్తునికి గనుపడుటట్లే. ప్రేమ హృదయమునగలవాడు శాశ్వతానందుడు. నిత్యసుఖుడు, ఈదైవికప్రేమవెఱ్ఱియే మనభౌతికరోగములకు శాశ్వతసిద్ధౌషధము. కోరికతోపాటు స్వార్థముగూడ నదృశ్యమగును. ఆతడీశ్వరునకు సామీప్యుడాయెను. ఇదివరకాతనికి బూర్ణముగనుండిన వ్యర్థవాంఛలనన్నిటిని ద్రోసివైచెను. ప్రేమమతములో మనమందరము ద్వైతులుగ నారంభింపవలెను. మనకీశ్వరుడొక భిన్నుడగుమూర్తి. మనముగూడ భిన్నులమనియే దలంచు[కొ]ందుము. అంతట ప్రేమ నడుమన వచ్చును. మనుజు... ఈశ్వరుడుగూడ మనుజుని



...డు తనజీవితములో వివిధములగు సంబంధములను,— తండ్రి, తల్లి, ...త్రుడు, మిత్రుడు, గురువు, భక్తుడు, మొదలగువాని నన్నిటిని ...గ్రహించి, తనప్రేమాదర్శము ఈశ్వరునిపై వ్యాపింపజేయును. ఆతనికివన్నియు నీశ్వర సదృశములే. ఆతనియభివృద్ధియొక్క పర్యవసానమాతడు తాను తనపూజావిషయమున బూర్తిగ లీనమైతినను తలంపు గలిగినపుడు పొందుచున్నాడు. మనమందరము స్వార్థప్రేమతో నారంభించుచున్నాము. ఈనీచమగు స్వార్థముయొక్క యోగ్యత ప్రేమను గూడ స్వార్థముగ జేయుచున్నది. కడకెట్లో యీస్వార్థమాయనంతమున లీనమగునట్లుగ గన్పట్టెడి యఖండజ్యోతి స్వరూపము ప్రసాదించును. ఈప్రేమ జ్యోతిముందు మానవుడే పూర్తిగమారిపోయి, కడకు, ప్రేమ, ప్రేమించువాడు, ప్రేమింపబడునదిగూడ ఒకటేననెడి సత్యము, శివమునగు, సుందరభావము ననుభవించును.

---

హరేర్నామ, హరేర్నామ, హరేర్నామైవ కేవలం
కలౌ నాస్త్యేవ, నాస్త్యేవ, నాస్త్యేవ గతి రన్యథా॥

శ్రీరామకృష్ణార్పణ మస్తు.



# విన్నపము.

నే నాంధ్రీకరించిన వివేకానందస్వాములవారి గ్రంథములలో నిది మొదటిది గాకున్నను ముద్రణమును బొందుటకుమాత్రము మొదటిదే. స్వాములవారి గ్రంథములలోని విషయము లన్నియు ప్రతిమానవునకును నవీనోత్సాహము నొసంగి జీవితసమస్యానిర్ణయమునకు దివ్యజ్యోతులై వెలుంగుననుట సర్వజనవిదితమే. శ్రీవారిబోధ లన్నియు శుష్కవేదాంత ప్రతిపాదితములు కాక పాశ్చాత్యవ్యామోహమున దిగుల్కొని తమ యుత్కృష్టాదర్శములను మరచి పతితులైనవారికి—పండితపామరులకు గూడ—వేదాంతము నెట్లాచరణలో బెట్టిన పునరుత్థానముగలుగునో విశదపరచుచుండును.

కావున వారిసంపుటము లన్నియు నాంధ్రీకరింపసమకట్టి ప్రథమమున నీపరాభక్తి నొసంగితిని. చదువరులు చందాదారులై తగుప్రోత్సాహ మొసంగుచో నాతలంపు శీఘ్రముగ ఫలించును. గ్రంథము లన్నియు చేర్చి ఆంగ్లేయమునవలె సంపుటములుగ నొనర్చుకొనుటకు వీలగునట్లు చక్కగ ముద్రింపబడి చక్కనిచిత్రపటములతో సహా వెలువడు చుండును. గ్రంథాదాయము గ్రంథములకేగాని స్వార్థమునకుపయోగింప బడదు. కావున కుతూహలముగలవారు చందాదారులుగ జేర ప్రార్థించు చున్నాను. ఈగ్రంథములు నాటకములు, నవలలవలె యొకపరి జదివి యావలబారవేయునవి గావు. రైల్వేసాహిత్యము గాదు. వీనిని జదివి మననము జేసి, నిత్యకృత్యాచరణమున నిడుకొనిన జీవితపరమా[ర్థము] బొందుటకు సాయపడును. ఓం శాంతిః శా[ంతిః]

వీనితోపాటు కొన్ని అనుబంధ గ్రంథములు గూడ వెలువడగల[వు].

౧. భక్తిమీమాంస.

